

# సతీతులసి

౨ అంకముల నాటకము


ప్రకాశకులు:

రంగా వెంకటరత్నం

బెజవాడ.

నాల్గవకూర్పు 1000 ప్రతులు





**Ranga Venkataratnam, BEZWADA.**

1926.

A. P. P. Works, Cocanada.

మావద్ద దొరుకు గ్రంథములు.

## కథలు.

| | | | |
|---|---|---|---|
| పన్నెండురాజులకథలు | రు. 1 | 0 | 0 |
| పదునాలుగురాజులకథలు | 1 | 0 | 0 |
| మదనకామరాజుకథలు | 0 | 12 | 0 |
| కాశీమజిలీకథలు 1భాగం | 0 | 12 | 0 |
| డిటో 2 భాగం | 0 | 12 | 0 |
| అరేబియన్నైట్సుకథలు | 4 | 8 | 0 |
| ప్రభక్తవిజయము | 0 | 8 | 0 |
| శుకసప్తతికథలు | 0 | 8 | 0 |
| పురూరవచక్రవర్తికథలు | 0 | 8 | 0 |
| అపరూపచంద్రకాంత | 0 | 8 | 0 |
| పంచతంత్రము | 0 | 8 | 0 |
| నలమహారాజుకథలు | 0 | 8 | 0 |
| దమయంతికథలు | 0 | 8 | 0 |
| కాళిదాసుకథలు | 1 | 4 | 0 |
| వీరేశలింగచరిత్రము | 1 | 0 | 0 |
| శ్రీనాథునిచరిత్రము | 1 | 0 | 0 |
| శ్రీకృష్ణభారతము ఆది సభాపర్వములు | 3 | 0 | 0 |
| డిటో అరణ్యపర్వము | 3 | 0 | 0 |
| కాశీ రామేశ్వరయాత్ర దర్శనము | 0 | 12 | 0 |
| సీతారామ నవల | 1 | 4 | 0 |

## నవలలు.

| | | | |
|---|---|---|---|
| సౌందర్యతిలక | రు. 1 | 0 | 0 |
| కర్పూరమంజరి | 1 | 0 | 0 |
| హేమలత | 1 | 0 | 0 |
| రాజరత్నం | 0 | 12 | 0 |
| రామచంద్రవిజయము | 0 | 12 | 0 |
| కృష్ణవేణి | 0 | 8 | 0 |
| చమత్కారమంజరి | 0 | 14 | 0 |
| డిటో 2 పార్టు | 0 | 14 | 0 |
| ప్రహసనమంజరి | 0 | 8 | 0 |
| అహల్యాబాయి | 0 | 8 | 0 |
| సిద్ధార్థచరిత్రము | 0 | 12 | 0 |
| రఘుకులచరిత్ర | 0 | 8 | 0 |
| మణిమంజరి | 0 | 8 | 0 |
| సువర్ణగుప్తము | 0 | 8 | 0 |
| వినోదగుప్తము 1,2పార్టులు | 1 | 0 | 0 |
| శారద | 1 | 2 | 0 |
| శాంతాదేవి | 1 | 0 | 0 |
| సతీసోఫారాణి | 1 | 0 | 0 |
| లలిత | 1 | 0 | 0 |
| సువర్ణశృంఖల | 0 | 8 | 0 |
| చంద్రవదన | 0 | 8 | 0 |
| పరమానంద చరిత్ర | 0 | 8 | 0 |

రంగా వెంకటరత్నం,

బుక్ సెల్లర్సు, బెజవాడ.

# సతీతులసి

తులసీమాధవము.

ప్రకాశకులు;

రంగా వెంకటరత్నం

బెజవాడ.

నాల్గవకూర్పు 1000 ప్రతులు.



హోల్ మోజుదార్లు.

ఆనందా బుక్ డిపో

బెజవాడ.



ఆల్బర్టు ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

 [వెల 1—0—0

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

## పురుషులు.

బ్రహ్మ—సృష్టికర్త.

విష్ణుమూర్తి—వైకుంఠనాథుడు.

పరమేశ్వరుడు—కైలాసపతి.

ఇంద్రుడు—అమరవిభుడు.

జలంధరుడు—పరమేశ్వరుని కోపజ్వాలవలన జనించినవాడు, బృందకుఁ బతి

మణికుండలుడు—బృంద తండ్రి.

నారదుఁడు—దేవముని.

గాలవుడు—ముని.

## స్త్రీలు.

సతీదేవి—పరమేశ్వరుని భార్య.

లక్ష్మి—విష్ణుమూర్తి భార్య.

బృంద—జలంధరుని భార్య.

చారుమతి—గాలవుని భార్య.



# పీఠిక

బైస్కోపు కంపెనీ (Bioscope Company) వారి ప్రదర్శనములలో "సతీతులసి బృందావనము" అను కథను జూచినప్పటి నుండియు, దానిని నాటకముగా వ్రాయవలయునను కోరిక కలిగినది దీనికిఁదోడు మిత్రులు గూడ నన్నునుదినమును సతీతులసి నాటకము వ్రాయవలసినదని తొందర పెట్టసాగిరి. కాని, నేను దాని విషయమై తగిన శ్రద్ధఁబుచ్చుకొనక కాలయాపనము సేయుచుండ, నింతలో "సతీతులసి" నాటకమును గూర్చిన ప్రచురణపత్రికలు (అనగా గ్రంథ విక్రయము నిమిత్తమై చేయఁబడినవి) రెండు మూడు నాకంటఁబడినవి. ఈనాటక రచనకై నన్నుఁ బ్రేరేచిన మిత్రులుగూడ వీనింజూచి, నీవు దీనిని నాటకముగ వ్రాయక యూరకుంటివి. చూడుము ఎవరో ప్రకటించుచున్నారనిపలికి వ్రాయునందుకు నన్ననేక నిష్ఠురములాడిరి. కాని, నేను వారికిఁదగిన సమాధానముఁజెప్పి, ఎవరో యొకరు వ్రాయుచుండిరి కదాయని యా యుద్యమమువిడిచి నాచిత్తము నొక్కింత మరలించితిని ఇంతమాత్రముచేత నామిత్రులు నన్ను విడువలేదు. మరలనొకవిధమైన ప్రకటన పత్రికను నాచేతికిచ్చిరి. అందు, "బైస్కోపు ప్లాటు ననుసరించి వ్రాయబడినదనియు, సతులసి దేవేంద్రుని కడగడ వడకించిన దనియు, మొదలుగాగల సంగతులతోనున్నది. బైస్కోపు ప్రదర్శనములో మొదటి నుండియు, కథానాయిక తులసిగనే యున్నది. దీనింగూర్చి కొంత విచారణముచేసి నాకీమరల నాటకము వ్రాయవలయునను తలంపు కలిగినది. అంతట తులసీదేవి వృత్తాంతమునకై ఆయాగ్రంథములను వెదకితిని. ఎక్కడఁజూచినను ప్రారంభము నుండియు, నెక్కడను తులసి. జలంధరునకు భార్యయై యున్నట్లుగాని, యింద్రుని తులసిదేవి వశకించునట్లుగాని కానిపించలేదు. నేనుజూచినంతవఱకు పురాణములందీక్రింద సంగతులున్నవి.

శ్లో॥ జలంధరస్య భార్యా భూద్బృందేత భువి విశ్వతా
పతివ్రతా వరారోహా ఛాయే వాను గతాపతిమ్॥
జలంధలో ఘోరయుద్ధే రుద్రేణ వినిపాతతః
విష్ణుస్న ర్వశరణ్యోపి బృందాందృష్ట్వా ముమోహా సః॥
భర్తారం నిహతంజ్ఞాత్వా చిత్యగ్నౌ ప్రవివేశసా॥
శ్లో॥ అతీవ మోహం సంప్రాప్తో విష్ణుర్ బృందాజపస్సదా
బృందాశ్మశానే ప్రలుణన్దివా రాత్రిం భ్రమాతుర॥
క్వాసి బృందే మాం విహాయర్వగతాసిను మధ్యమే
త్వాం విహాయనజీవామి బృందే పశ్యముఖంమమ॥
ఇతి జల్పన్మహా విష్ణుశ్శ్మశానం నజహాదిరం॥
శ్లో॥ విష్ణోరభావా ద్వైకుంఠే హాహాకారో మహానభూత్
బ్రహ్మరుద్రాది దేవాశ్చచరిత్రం వైష్ణవంతదా
విచార్య విష్ణోత్సం మోహజ్వరం స్త్రీకృతమేవహి
ఇతినిశ్చిత్య బ్రహ్మాద్యాః స్త్రీజ్వరం స్త్రీయహోపమేత్
ఏవంతే గిరిజావాణీ లక్ష్మీ ప్రార్థన మాచరన్
ఇంద్రా ద్యాదేవతాస్సర్వే ప్రార్థయా మాసురంజసా॥
శ్లో॥ వాణీతు ప్రార్థనాం శృత్వా బజమేకం దదావథ
యూయం బృందాశ్మశానేతు విష్ణోర్మోహ పనుత్తయే :
రోపయధ్వం ప్రయత్నేన సఫలం భవతిధ్రువమ్
పత్రద్రోపణ మాత్రేణ కార్యసిద్ధిర్భ వేదితి
దదావథత మాదాయ కైలాస మగమస్సురాః
పార్వతీం ప్రాప్యదేవా వైప్రార్థయా మాసురేవహి
పార్వతీ ప్రార్థనాం శ్రుత్వా బీజమే కందదాతథా
తతస్తులక్ష్మీం సంప్రార్థయా మాసురంజసా
లక్ష్మీరపీర్ష్యయా ప్రాదాత్బీజమేకం సుశోభనమ్॥
శ్లో॥ దేవా బీజాని సంగృహ్య విష్ణుర్యత్రా వతిష్ఠతే
శ్మశానే రోపయామా సుస్సించంతో నిర్మలైర్జలైః
భారత్యాదత్త బీజాద్వై బదరీసంబ భూవహా
పార్వతీ దత్త జీజాత్తు తులసీ సంభ భూవహా

లక్ష్మీచేర్షా వశాద్దత్త బీజాన్మాలత్య భూత్కల
ఆత స్తస్మాద సీరుత్సేవా యోగ్యాపభూవహా
ఆత స్తత్తుల సీజన్మపార్వతీ తిహినిశ్చయః॥
శ్లో॥ విశ్వేశ్వరః పార్వతీచయత్రాస్తే తత్ర కేశవః
శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయంశివః
తులసీకాననం యత్రతత్ర సన్నిహితోహరిః॥

ఈ శ్లోకములను బట్టిచూడ జలంధరుని భార్యబృందయనియు, జలంధరుఁడు యుద్ధమున శివునిచేఁగూలఁ, బృంద భర్తతో నగ్నిప్రవేశ మొనర్ప, బృందపై మోహమున విష్ణుమూర్తి బృందయొక్క శ్మశాన మునఁ జరించుచుండ, దేవతలు లక్ష్మీపార్వతీ సరస్వతుల వలన బీజ ములఁగ్రహించి శ్మశానమున నాటిరనియు, పార్వతియిచ్చిన బీజము వలన తులసి మొలిచెననియుఁ దెలియుచున్నది.

ఈ స్వల్పగాథను నాధారముగాఁ జేసికొని ప్రధానకథకుభంగ మురాకుండ "బైస్కోపుప్లాటు"ను గూడ గొంతవఱ కనుసరించి నాటకముగా వ్రాసితిని. బృందయొక్క జన్మవృత్తాంతముగాని, యామె తల్లిదండ్రుల నామములుగాని నేఁజూచినంతవఱకు లభించలేదు ఆకార ణమున బృందతండ్రి పాత్ర కింపు "మణికుండల" నామమిడితిని. జలం ధరుని దుష్కృత్యములఁ జూపుటకై యొక మునిభార్య పాత్రను గల్పిం చితిని. ప్రధాన కథకు భంగముగాకుండ నిట్టి స్వాతంత్ర్యము బూనుట నాటకములయందు గవులకాచారమే. అయినను. నీవిషయములం గూర్చి యిఁకను బరిశోధించి, పునర్ముద్రణమందు సవరించుకొందును. ఇతివృత్తము స్వల్పముగానున్న నిట్టి కథను నాటకముగా వ్రాయుట బహుకష్టము. "చేయుటకంటె జెప్పుటచులకన" యనుసామెత ననుస రించి, యేమియుఁ బనిలేక తీరుబడిగా గూర్చుండు మహనీయులు రసా రసచర్చ నెంతయైనను జేయుదురు అట్టివారికి మాత్రము నేనేమియుఁ జెప్పక, సదయహృదయుల కీనాటకము సమర్పించినాను గుణాగణము లరయు భారము వారికే విడిచిపెట్టితిని.

ఇట్లు
గ్రంథకర్త.

# సతి తులసి.

## కథాసంగ్రహము.

### ప్రథమాంకము.

రంగము 1:—తపోనిష్ఠనున్న ఆదిశక్తిని దర్శింపఁ దలఁచి ఇంద్రుఁడు వచ్చుటఁ జూచి, యచ్చటనున్న పరమేశ్వరుఁడు ఇంద్రుని వారించుట ఇంద్రపరమేశ్వరుల సంవాదము. పరమేశ్వరు డాగ్రహమంది యాతనిని దగ్ధముసేయఁబోవుట. ఇంద్రుఁడు మహేశ్వరుని క్షమింప వేడుకొనుట. పరమేశ్వరుఁడు తన మూఁడవ కన్నునుండి వెడలిన జ్వాలను సముద్రమునఁ బడునట్లు పారవేయుట

రంగము 2:—పరమేశ్వరుఁడు విడిచిన జ్వాల శిశురూపమున సముద్రముపైఁ దేలియాడుచుండ సముద్రుఁడా బిడ్డను గైకొనుట. ఇంద్రుఁడు— పరమేశ్వరుఁడు — విష్ణుమూర్తియు, నా శిశువును జూడవచ్చుట. విష్ణుమూర్తి యా బిడ్డను నెత్తుకొని ముద్దాడుచుండ, నా శిశువు ఘోర రూపము ధరించి యాతనిం జంపఁబోవ విష్ణుఁ డాతని దునుమనెంచ దేవతాప్రార్థితుఁడై శాంతించుట. ఈశ్వరుఁ డాతనికి జలంధర నామమిడి వరంబులిచ్చుట.

### —: ద్వితీయాంకము :—

రంగము 1:—బృంద తన గళంబున పుష్పహారము వేయుచుండ అదిజారి క్రిందఁబడెనని కోపమున నామెను స్వీకరింపనని వచ్చుచున్న జలంధరుని నారదుఁడు శాంతపఱచి బృంద గైకొనునట్లు సమ్మతింపఁజేయుట. "మణికుండలుఁడు" తన కూతురగు బృందను జలంధరునకిచ్చుట. జలంధరుఁడు బృందను నిజగృహమునకుఁ దోడ్కొని పోవుచు ననేకవిధముల దూషించుట.

రంగము 2:—వనమున విష్ణుమూర్తి బృంద సౌందర్యమును గూర్చి తనలోఁ దాను తలపోయుట. బృంద వనవిహారమునకు వచ్చి జలంధరుని దుష్కృత్యములఁ గూర్చి విచారించుట. విష్ణు

మూర్తి బృందను మోహించి యామెం జేరి తనయభీష్టము దెలుపుట. బృంద విష్ణుమూర్తిని నిరాకరించి పలుకుట.

—: తృతీయాంకము :—

రంగము 1:—అరణ్యమున గాలవుడను మునిపత్నియగుచారుమతియాశ్రమమున నొంటరిగా నుండగా జలంధరుఁడు వచ్చి యనేకవిధముల నామెతో భాషించుట. ఇంతలో నామె భర్త వచ్చుటఁ జూచి వెడలిపోవుట.

రంగము 2:—మందిరమున బృంద జలంధరునితో దుష్కృత్యముల సేయవలదనియు, బరాంగనలఁ జెరబట్టవలదనియుఁ బ్రార్థించుట. ఆసమయమున జలంధరునిచే నాజ్ఞాపింపఁబడిన భటులు చారుమతిని బంధించుకొనివచ్చుట. బృంద జలంధరుని బ్రతిమాలి చారుమతిని విడిపించుట నారదుఁడువచ్చి పార్వతీ విషయమై ప్రయత్నించుమని జలంధరునిఁ బ్రేరేపించి వెడలుట. జలంధరుని యుద్యమ మెఱింగి, బృంద యాతనిని వారింపఁ బ్రయత్నించుట. బృంద మాటలు వినక జలంధరుఁడు కైలాసమున కేగుట.

—: చతుర్థాంకము. :—

రంగము 1 :—జలంధరుఁడు కైలాసమున పరమేశ్వరుఁడు లేని సమయముజూచి సతీదేవిని బట్టబోగా, బరమేశ్వరుఁడువచ్చి యాతనిని భస్మముసేయదలఁచు సమయమున బృంద యరుదెంచి యాతనిని బతిభిక్షఁ బెట్టుమని ప్రార్థించుట.

రంగము 2:—జలంధరుఁడు తనభార్య యుండుటవలనఁ బరస్త్రీలబంధించుటకు వీలులేకుండ నుండెనని యామెను సముద్రమునఁ బడవేసిపోవుట. విష్ణుమూర్తి యామెను రక్షించి బృందావనమున నుంచుట.

రంగము 3:—ఇంద్రుఁడు మొదలయిన దేవతలు విష్ణుమూర్తిసన్నిధికరిగి, జలంధరుని దుష్కృత్యములవచించి రక్షింపుమని ప్రార్థించుట, బృంద పతివ్రతాత్వమునకు భంగ మొదవించిన గాని జలంధరుఁడు మడియఁడని శ్రీహరి చెప్పుట. విష్ణుమూర్తి యా

కార్యభారమును బూని వెడలుచు, నారదునితో జలంధరుని బర
మేశ్వరునిపైకి యుద్ధమునకై వెడలఁ బ్రేరేపింపుమని చెప్పుట.

—: పంచమాంకము. :—

రంగము—1 నారదుఁడు జలంధరునితో సంభాషించి పరమే
శ్వరునిపై యుద్ధమునకుఁ బురికొల్పుట.

రంగము—3 విష్ణుమూర్తి జలంధరవేషముతో బృందకడకు
వచ్చుట. బృంద యాతనిని బతిగాఁభావించి, పరిచర్యసేయఁ గడంగుట
యుద్ధమునందు పరమేశ్వరునిచేఁ దెగిపడిన జలంధరుని శిరము
బృందముందు పడుట. బృంద యదిచూచి, విష్ణుని కపటమును
గ్రహించి యాతనిని బాషాణ మగుమని శపించుట లక్ష్మీదేవి
బ్రహ్మేంద్రులతో వచ్చి తనకుఁ బతిభిక్షఁ బెట్టుమని బృందను
బ్రార్థించుట. తాను భర్తతో సహగమనముఁ జేసినచో విష్ణు
మూర్తి శాపము వాయునని చెప్పి యా బృంద యగ్నిఁజొచ్చుట.
విష్ణుమూర్తి శాపము వాసి బృందంగూర్చి యచ్చటనున్న వారిని
నడుగగా వారు జరిగిన సంగతిఁజెప్పుట. విష్ణుమూర్తి బృంద శరీ
రమువిడిచిన శ్మశాన భూమికి వెడలుట.

—: షష్ఠాంకము :—

రంగము1—ఇంద్రుఁడును బ్రహ్మయు, విష్ణుమూర్తి బృందకై
పడుపరితాపమునుగూర్చి విచారించి సతీదేవి కడకరిగి యావృత్తాంత
మునుజెప్పుట వారు లక్ష్మి పార్వతీ సరస్వతుల వలన బీజములను
గ్రహించి విష్ణుమూర్తి మోహమున జరించుచున్న శ్మశానము
నందు నాటుట.

రంగము2—బృంద తులసియై మొలచుట. తులసిని బృందా
వనమునకుఁ జేర్చుట విష్ణుమూర్తి స్వస్థచిత్తుఁడగుట. తులసీ
మహాత్మ్యము.





# సతీ తులసి



## నాంది.

శా॥ బృందం గోరి విచారమం దగునే ♦ విష్ణుండ వైయుండి; యీ
చందంబుల్ విని నర్జనుల్ నగరె చా ♦ ల్చాలింక యంచున్ మహా
నందంబొప్పఁగఁ బల్కుఁ గౌగిట రమా ♦ నారిన్ గృపం జేర్చు, గో
విందుం డేలును గాత సత్కృప మెయిన్ ♦ వీక్షించుచున్ సభ్యులన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు:—(ప్రవేశించి) పూజ్యులగునో సభాస్థారులారా!

శా॥ శ్రీకల్యాణ గుణాకరుం డమరసం ♦ సేవ్యుండు నిత్యుండు, లీ
లాకారుం డఖిలాంతరంగుఁ డమలుం ♦ డాద్యుండనంతుండు, సు
శ్లోకుం డాశ్రిత భక్తరక్షణుఁడు, త్రై ♦ లోక్యప్రభుండైన, ల
క్ష్మీకాంతుండు నిరంతరంబును శుభ ♦ శ్రీలిచ్చి మిమ్మోముతన్.

(సభ్యులపైఁ బుష్పములఁజల్లి తనలో) ఆహా! సకల కలావిశారదులగు నీ సభ్యులచే నే డొక నూతన నాటకము ప్రదర్శింపఁజేయుట కాజ్ఞాపింపఁబడితిని. ఇయ్యది నాకు సంతోషమేగాని యే నాటక ప్రదర్శనమున వీరి చిత్తము రంజిల్లఁజేయుదునా యని సంశయము గలుగుచున్నది. కానిమ్ము. (ప్రక్కఁజూచి) మారిషా!

మారిషుఁడు:—(ప్రవేశించి) బావా! ఏమి సెలవు?

సూత్ర:—ఇంకను నేమి సెలవుయని యడుగుచుంటివా? కార్య [illegible] పైనుండ నీవిట్లు సోమరివై యుండిన నేనేమందును?

మారి—బావా! నేను చేయవలసిన కార్యమేమి!

సూత్రి—మారిషా! లతాంతనితాంత సౌరభాక్రాంత దిగంతమును, నిరంతర దక్షిణవాత పూర్ణరోధోంతమును, కోకిల భృంగ శుకారవ చాలితదాంత సంతతిస్వాంతమును నగు వసంతము ప్రవేశించినది, చూడుము

చ. పరుషతమస్సమూహము ప్ర॥ భాతపువేళను మెయ్యనంజనం
గ గహిసురేడ్ఢిశాతటుల ॥ గ్రాలునినోదయకాంతి పంక్తిపై
ఖరిఁబడిశీర్ణ జీర్ణదళ ॥ కాండములైన మహీజశాఖికో
త్కరములఁ బల్లవాంకురని ॥ కాయము రంజిలె మంజులాకృతిన్.

మారి—ఈ వసంతకాలమెంతయు సౌఖ్యదాయకమైనదికదా!

సూత్రి—ఈ వసంత రాత్రిమున, నీ సభ్యులకు నొక నూతన నాటక ప్రదర్శనమున సంతసము గూర్చదలఁచితిని.

మారి—నాటకమేదో నిశ్చయించుకొంటివా?

సూత్రి—అందులకే నిన్నుఁబిలిచితిని.

మారి—బావా! ఇంట బిడ్డనిడికొని యూరంతయు వెదకినట్లున్నది. నీవు నాందియందు చక్కని కథనే సూచించితివికదా!

సూత్రి—మారిషా! ఆ కథను చక్కగ జ్ఞప్తికిఁ దెచ్చితివి. ఆ కథ! "సతీతులసి" యను పేర నాటకముగ నిటీవలనే యొక కవిరచించినాడు. అయ్యది యింతవరకెవ్వరును బ్రదర్శించకపోవుటం జేసి, ప్రథమ ప్రదర్శనా గౌరవము మనము దక్కించుకొందము.

మారి—ఆర్యా! గ్రంథకర్త రచనావిశేషమునుబట్టి నాటక ప్రదర్శకులకును, ప్రదర్శకుల నైపుణినిఁబట్టి గ్రంథకర్తకును పేరువచ్చును. అందుచే నీ నాటకము రచించినవారెవరో తెలిసినగాని నేనేమియు జెప్పజాలను.

సూత్రి—నీ వా విషయమున సందియమందఁబనిలేదు.

## ప్రథమాంకము.

చ. తిరుపతి వేంకటేశ్వర సు • ధీమణులం గొల్చి నిరర్గళామృతా
కరరసపుంజ మంజుల వి • కస్వర చారు కథాసుధాధురం
ధర బహుళప్రబంధ కవి • తా రచనాచతురోక్తి సంపదన్
వరలు ప్రసిద్ధుఁడైన కవి • వర్యుఁడొకండు రచించె దీనినిన్.

మారి— పేరు రహస్యమైనదా యేమి?

సూత్రి— అతఁడు మనకుఁ జిరపరిచితుండే;

సీ. మొగమైనఁ జూపకే • భూరి వెంకటగిరి,
క్ష్మాపాలు సత్కృతిఁ • గాంచినాఁడు
తిరుపూరు నృపతికి • దివ్యకవితఁ జూపి,
బంగారు బిరుదంబు • బడసినాఁడు
అంకినీడ్భూపతి • యాదరింపఁగ నెంత,
యైన విమలయశం • బందినాఁడు
సత్యవోల్వంశాబ్ధి • చంద్రులు తగిన స
త్కవివంచు మన్నింప • దనరినాఁడు

తే. గీ. కోటగిరివంశ వారాసి • కువలయాప్తు
చేత బంగారు బిరుదంబు • జెందినాడు
వినగలేదె ద్రోణమురాజ • విమలవంశ
వార్ధిశశిని సీతారాము • వరసుకవిని.

మారి— అవునవును. జ్ఞప్తికివచ్చినది. అనేక దృశ్యకావ్యముల కీతఁడు కర్త యగుటయే గాక ఈతని విరచితములగు కొన్ని వచన గ్రంధములు పాఠశాలలయందుంచుటకుగూడ దొరతనమువారిచే నామోదింపఁబడినవి.

సూత్రి— నీకుఁ దెలియని దేమున్నది? (సభికులంజూచి) పూజ్యులగు నో సభాస్తారులారా! గ్రంథకర్త తమతో నిట్లు విన్నవింపుమని నాకాజ్ఞాపించినాడు.

సీ. సాంధ్రభాషావిశే • షరహస్య నిక్షేప,
కుక్షియె యలరెడు • కోమలాంగి

వేశ్యఁ జూపఁబడ కొ ♦ ప్పిన యసురుఁ బతిరీతి
వర్తించుచుండిన ♦ వారిజాక్షి
క్షితినాథ చంద్రుల ♦ స్తుతిగాంచి యశముతో.
వర్ధిల్లుచుండిన ♦ పద్మగంధి
గర్వమింతయు లేక ♦ కవులకెల్ల విధేయ,
తనుజూపి చెలగెడి ♦ తలిరుబోడి

తే. గీ. మామక కవిత్వ కన్యక ♦ మహిని మీకు
నూతనముగాదు; గావునఁ ♦ భీతి విడిచి
యీ "సతీతులసి" ని మీరు ♦ కడితి దీని
నాదరింపుడు ప్రీతిమై ♦ నార్యులార.

(ఇంచుక యూరకుండి) నా విన్నపముగూడ నొక్కింత వినుఁడు.

సీ. సాధ్వియా బృందపై ♦ సాహసంబున జలం,
ధరుఁడు జూపెడి నానా ♦ దరణవిధము
గర్వంబునను పర ♦ కాంతల బల్మిమై,
గూడగానెంచిన ♦ కొంటెతనము
ఎంత చేసినఁగాని ♦ యింతి నాసిని సతి,
శాంతితో గొల్చెడి ♦ సరళతయును
లోకరక్షకుఁడయ్యు ♦ లోలాక్షి బృందను,
విష్ణుండు మోహించి ♦ వెలయు నీతి

తే. గీ. పతి గతింపఁగ నా బృంద ♦ ప్రాణములను
బాసి, తులసియైన విధంబు ♦ బరగమీర
లిందు వీక్షించి యానంద ♦ మందగలరు
ధన్యగుణులార యో సభా ♦ స్తారులార.

(మారిషునిఁజూచి) మారిషా! ఇంక మనమాలస్యము జేయక పాత్రలను సిద్ధము జేయుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



# సతీతులసి.

## ప్రథమాంకము.



రంగము:-(1) [పర్వతగుహాద్వారమున ప్రవేశము:-పరమేశ్వరుఁడు]

పర—(తనలో) మూఁడుమూర్తులకును మూలకారణమైన మాయాదిశక్తి యెప్పటికి దపము జాలించునో! ఆమె తన తపమున కెన్నఁడైన భంగము గలిగించెదరేమోయని నన్నియ్యెడ నతి జాగరూకతతో నుండుమని చెప్పెను. ఇంతవరకును నామె లేవలేదు. మింటఁబ్రభాకరుఁడు తన ప్రచండకిరణములతో బ్రకాశించుచున్నాఁడు. అబ్బా! వేఁడి యధికముగనున్నది. (అటునిటుచూచి)

వ. మిహిరుని వేడికిన్ మిగుల ♦ మింటఁజరింప నశక్యమై తనూ
రుహములు వీచనోడి కడు ♦ రోజుచు బల్వడనొందుచున్ మహా
ర్మహారుదితార్తితో గగన ♦ మున్ వెస నంటిన వానిఁబిల్చుచున్
విహగకులంబులెల్లఁ దరు ♦ వీథుల మీఁదికిఁజేరె నొయ్యనన్.

[ఇంద్రుఁడు—ప్రవేశించును.]

ఇంద్ర—(తనలో) సృష్టిస్థితిలయంబులకు గారణంబైన యాదిశక్తిని నొకసారి దర్శించి కృతార్థుఁడనగుదుగాక- (ఎదుటఁజూచి) కైలాసపతి యగు పరమేశ్వరుఁడు గూడ నిచ్చటనే యున్నవాఁడు. ఈతని దర్శనముగూడ నాకిచ్చట లభించుట నాభాగ్యవిశేషమే.

(పరమేశ్వరుని సమీపించి)

సీ. పరమపావనియందు ♦ బిరుదంబు గాంచిన
గంగాఝురము మస్త ♦ కమున నమర

నళికభాగమునందు ♦ నలఘు కుంకుమబొట్టు
గతినున్న మూడవ ♦ కన్ను మెరయఁ
వజ్రపంజరనిభ ♦ వక్షస్థలంబున
రమణీయ సర్పహా ♦ రంబు లలర
పగడంపు కాంతికి ♦ వంకఁబెట్టగజాలు
నరుణజటాసము ♦ త్కరము దనర

తే. గీ. బాణిపాషిత హరిణశా ♦ బకము జెలఁగ
గన్నులకు బండువై నమం ♦ గళములకును
నాస్పదంబైన నీమూర్తి ♦ నార్తిదీరఁ
గాంచినాఁడను ధన్యతఁ ♦ గాంచినాఁడ.

(పరమేశ్వరుని సమీపించి) రజితాద్రి నిలయా! శంకరా! వంద
నములు.

పర—ఓహో! ఇంద్రుఁడా యేమి!

తే. గీ. సుఖమె నీభార్య పౌలోమి ♦ శుభమె మీజ
యంతపుత్త్రుండు భద్రమే ♦ యమరతతికి
నీకు నిరతంబు మోదమే ♦ నాకలోక
సార్వభౌమ! వచింపుమా ♦ సంతసింతు.

ఇంద్ర—దేవా! నీకరుణచే మేము సుఖముగనే యుంటిమి.

పర—మహేంద్రా!

తే. గీ. అదె నభోమండలంబున ♦ నయ్యెనందు
చండకిరణుండై యుండె నీ ♦ సమయమందు
నెటకుఁబోవుచు నిచ్చోట ♦ కేగుదెంచి
నావు, వినఁదలంతును గార ♦ ణము బలారి.

ఇంద్ర—మహేశ్వరా! నాకితర కార్య మేమియును లేదు.
నిక్కడకే యరుదెంచితిని.

పర—కారణము.

ఇంద్రు—ఆదిశక్తిని దర్శించుటకు.

పర—అహాహా (నవ్వుచున్నాఁడు)

ఇంద్రు—శంకరా! అట్లు నవ్వితివేమి?

పర—మఱేమియును లేదు. ఆజగజ్జనని యోగసమాధియం దున్నది.

ఇంద్రు—తపమునుండి యెప్పటికి లేచునో తెలియదు. అయినను నామె యిప్పుడెవ్వరికిని దర్శనమీయదు. కావున నీవా యాశ యిప్పటికి విడిచి మఱియొక సమయమున రమ్ము.

ఇంద్రు—పరమేశ్వరా! నీవట్లు జెప్పిన నేమందును? దయయుంచి నా రాక నమ్మహాదేవి కెఱింగింపుము.

పర—ఆమె నీవిప్పుడెంత శ్రమపడినను దర్శనమొసంగదు.

ఇంద్రు—ఏమది! ఆమె నాకు దర్శనమొసంగదా!

చ. అమర విభుండనై విబుధు • లందఱు గొల్చుచునుండ నాకలో
కము రహినేలు నన్నిపుడు • గాంచకయుండునె యాదిశక్తి, తా
నమిత కృపారసంబున న • యారె! యిటుల్ వచియింప నీకున్యా
యమొ? కృపఁదాల్చి చెప్పుము మ • దాగమనంబును నామెకీశ్వరా.

పర—నీభాగ్యమునుబట్టి యామెనీకు దర్శన మొసంగునని తలంచుచుంటివా యేమి! గర్వాంధకారమున మునిఁగియున్న నిన్ను జూడనే చూడదు.

మ. అలఘు ప్రజ్ఞను యోగమార్గముల న • భ్యర్థించు యోగీశ్వరా
వళికైనన్ నిరతంబదృశ్యయగుచున్ • భాసిల్లు నద్దేవిఁగ
న్నుల వీక్షింపఁగఁజాల నీవిపుడు ని • న్నున్ లక్ష్మీగర్వాబ్ధిలో
పలుగ్రుంగం బొనరించి యుండుటను దే • వాధీశ వేయేటికిన్.

సంపదాంధులను నామె వీక్షించదు.

ఇంద్ర—ఉమాకళత్రా! నీ వాక్యములు చిత్రముగనున్నవి నీవు కేవల మసూయాపరుఁడవై యిట్లు వచించుచుంటివిగాని వేఱి యొండుకాదు. సమస్త సౌఖ్యములకును మూలము సంపదయేకదా! సంపద లేనివాని బ్రదుకు నిరర్థకము.

పర—ఆసంపదయే మానవుని గ్రుంగఁ జేయునది నీవమరలోక విభుండ వనుమాటయేగాని నీబ్రదుకునకు ప్రతిదినమును గండమే.

తే. గీ. ఎప్పుడే క్రూరదానవుం • డెత్తివచ్చి
రణముఖంబున గెల్చి సా • మ్రాజ్యలక్ష్మి
నపహరించునో యనుచు నీ • వాత్మయందు
చింతతోడనుండెదవు శ • చీకళత్ర
నాకట్టి చింత యేమియు లేదుకదా!

ఇంద్ర—నిజమే.

సీ. వసియింప సౌధంబు • వరలకుండుట నెల
వెలయు చుండుదు నీవు • వెండికొండ
కడుపు గూటికి లేని • కతమునఁ దిండువా
ప్లోదమై సంగ హా • లాహలంబు
ధరియింప హారముల్ • దొరకకుండుటచేత
మెడఁదాల్తువో గాని • మేఁతకుంపు
దారిద్ర్యబాధచే • ధనమున కాసించి
చేరినాఁడవల కు • బేరు మైత్రి
తే. గీ. యిట్టివాఁడవు నీవు న • న్నేల పరిహ
సింప? వలదు నీస్థితి నాకు • జిత్తమునకు
దుఃఖమైనను లేక సం • తోషమైన
ధనము లేనట్టి బ్రదుకు వ్య • ర్థంబుగాదె.

సీ. భిక్షకై పాత్రయు • వేయకుండుటచేత
బట్టినాఁడవు చేత • బ్రహ్మశిరము

# ప్రథమాంకము.

గప్పకొంటకు శాటి • గానక దాల్చినా
వింపని భావించి • యేన్గుతోలు
విహరింప వనిలేక • విహరించుచుందువు
బహుభయంకరమైన • వల్లకాటి
వాహనంబులు లేక • బహుమోదమని యెంచి
యెక్కుచుంటివిగాదె • వృషభమూరి

తే. గీ. యిట్టిదేకద నీస్థితి • యెవ్వరెఱుఁగ
రేల నాపై ననూయవ • హించిపలికె
దిట్లు? పరశక్తి దర్శింప • నెంచునాకు.
కొద్ది గొప్పలతోనేమి • కుధరవాస.

పర — ఓహో! మహేంద్రా! నాస్థితిని నీవు వెక్కిరించుచుంటివిగ! నీకెంత భాగ్యమున్నను నాకుఁదుల్యుండవుగావు. వెఱ్ఱివాడవై నీవు నన్ను బరిహసించుచుంటివి. నీవాడశక్తిం సి దర్శింపవచ్చితివి. ఇది సమయముగాదని చెప్పితిని. దానికీయనపసర ప్రసంగమేల? తొందరపడినచోఁ గార్యమగునా?

తే. గీ. ఎద్ది యెప్పుడుగాదగు • నద్దియప్పు
డగును నీవెంతచేసిన • నగునె చెప్పుము
కొట్టి లేపిన యీకోడి • కూసినంత
నర్ధనిశిఁ బ్రొద్దు వొడుచునే • యమరనాథ.

ఇంక శ్రమజెందక యిప్పటికి మరలిపోయి మఱియొక సమయమున రమ్మా.

ఇంద్రు — ఇట్లు జెప్పుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది? ఆపరంజ్యోతి నీయట్టి వారిని ద్వారరక్షణోద్యోగమున నియమించుటంజేసి యిట్టిది సంభవించుచున్నది.

తే. గీ. అల్పుడవు నీకు నధికార • మబ్బుకతన
నిట్లు సాహసంబునఁ జేయ • నెంచినావు

పేనునకుబెత్తనంబీయ • వెఱ్ఱియగుచు
శిరమునంతయుఁ గొఱికిన • కరణి నభవ.

పర—మహేంద్రా! మితిమీఱి మదీయ మహిమంబెఱుంగక సంభాషింపకుము వినాశకాలమునకు విపరీతపు బుద్ధులు పుట్టునన్నట్లు నీకు జేటుకాల మాసన్నమగుటచే నన్ను దూషించుచుంటివి. బ్రదుకఁ దలంచిన వాడవేని వచ్చినమార్గమునుబట్టి పొమ్ము. ఆదిశక్తిని దర్శించుటకిది సమయముగాదు.

ఇంద్రి—పోనిమ్ము. భగవతి సందర్శనము జేసికొనఁదలంచిన నాకు నీయాజ్ఞతోనేమి పనియున్నది? నేనేలోనికేగి యద్దేవి తపము నుండి లేచువరకును వేచియుండెదఁగాక! (లోపలికి పోబోవును.)

పర—(వారించి) ఔరా! ఏమి నీగర్వము!

శా. ఏమేమీ కనుగాన కీకరణి, నీ • వేయాదిశక్తింగనం
గా మోదంబున బోవఁజూచెద వెమ • ఱ్ఱ్మక జూడ కొక్కింత, నా
సామర్థ్యంబు దలంప వేటికి, వినా • శంబుక్ మదింగోరి యా
భీమోద్యత్ప్రశియాగ్నిమీద శలభం • బేదూక నుంకించునే.

ఇందులకుఁ దగిన ఫలమనుభవించెదవుగాక! ఇవిగో! మదీయ నిర్నిరోధ క్రోధారుణ వీక్షణంబుల నత్యుగ్రహుతాశను శుక్షణిస్ఫులింగ నికరంబుల గురిపి నిన్ను దగ్ధము జేసెదఁగాక! (కోపముతోఁజూచినంత నే యచ్చట యగ్ని జ్వాలలు వెడలును.)

ఇంద్రి—(వడకుచు) హా! పరమేశ్వరా! అపరాధిని రక్షింపుము-రక్షింపుము. (పరమేశ్వరుని పాదములపైఁబడి)

మ. సరసీజాతభవాది శేఖవరున • శ్రాంతంబు సేవింపఁ బె
ల్లిరవైమించు మహానుభావుఁడవు నీ • సిబ్బంగి నాయందు, దు
ర్భరకోపంబునుబూని చూచిన నిఁకన్ • బ్రాణంబులున్ నిల్చునే
పరిరక్షింపవె నీకు మ్రొక్కెదను దే • వా! శైలజావల్లభా.

శా॥ శ్రీవిష్ణుస్తుతపాదపద్ముడవునై • చెల్వొందుచున్ భక్తులకా
గావంగంకణముంగా ధరించి, సతితోఁ • గైలాసమందుండు, నా
దేవేశుఁగా నిను నెఱింగియు మదాం • ధీభూత చిత్తుండనై
యేవో మాటలు నాడినాడ నిఁక దం • డ్రీ నన్ను రక్షింపవే.

పర— (చేతులతో నిందుని లేవనెత్తుచు) మహేంద్రా! భయమువిడిచి లెమ్ము. నీకభయమిచ్చితిని.

ఇంద్రు—(కరములు మోడ్చి)

మ॥ అపరాధంబని యైన యెంచక మదీ • యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ నిన్నుఁబల్కితి భవ • ద్విఖ్యాత కారుణ్యదృ
ష్టిపథంబందున నన్ను నిల్పుచును ర • క్షింపందగుంగా వేగ, నే
నపవిత్రుండఁ బవిత్రుఁజేయుము మహా • త్మా! భక్తరక్షామణీ.

దేవా! భవదీయ దివ్యమహిమ నెఱింగియుండియు, మూఢుండనై యజ్ఞానంబునబడి నీయెడల నపరాధంబు గావించితిఁ. భవదీయ వీక్షణంబులనుండి వెలువడిన యగ్నిజ్వాలంబు లింకను బ్రజ్వరిల్లుచునే యున్నవి. నాభయము బాపి రక్షింపుము.

పర— తే. గీ. చింతపడబోకు దీనికి • స్వాంతమందు
జ్ఞానులకె యిట్టిదొకప్డు • సంభవించు
నీవు ధన్యుండవైతివి • నేడు నాదు
కరుణఁగాంచినాడవు గాన • సురకులేంద్ర,

(అగ్నిజ్వాలలకై చూచి) నానేత్రమునుండి వెలువడిన యీయగ్నిజ్వాలలు నిరర్థకమై పోవరాదు. కావున నేను వీనిని సముద్రమునఁ బడునట్లు వైచెద. ఈజ్వాల యొకని జన్మమునకుఁ గారణమగుగాక.

(అగ్నిజ్వాలలను జేతితోఁబట్టి విసరివేసి)

మహేంద్రా! ఇంక నీ వరుగుము.

ఇంద్రు—(నమస్కరించి) దేవా! సెలవుగైకొనెద.

(నిష్క్రమించును)

పర—ఆదిశక్తి తపమునుండి లేచినదేమో చూచెదఁగాక.

(నిష్క్రమించును.)

రంగము:—(2) [సముద్రముపై నొక శిశువు తేలి యాడుచుండును. సాగరుఁడు - ప్రవేశించును.]

సాగ—(శిశువుంజూచి) ఔరా! ఈ బాలుఁడెవ్వఁడోకదా! ఎవ్వఁడో దేవాంశ సంభూతుఁడై యుండును. కానిచో, జలంబున మునుగక తేలుటయెట్లు సంభవించును. సాధారణముగ భూమిపైఁ బ్రాకిన విధముననే నీతఁడు జలముపైఁ బ్రాకుచున్నాఁడు (ఇంచుక యూరకుండి) నే నీ శిశువుం దీసెదగాక. (శిశువునుదీసి యెత్తుకొని)

మ. పరమైశ్వర్యము వీని నెమ్మొగ మహా • పర్వేందు బింబంబు నే
పరిహాసంబొనరించుఁ దేజముగనన్ • బ్రహ్మప్రపంచ మించు నె
వ్వరిసూనుండొకదా తెలంపఁగను నీ • భంగిన్ ననుంజేరె; స
త్కరుణన్ వీనిని నెత్తి పెంచెదను వే • డ్కన్ దేవతల్ మెచ్చఁగన్.

ఈబాలుఁ డొక యపూర్వ తేజశ్శాలి, భగవదాంశ సంభూతుఁడుగాని సామాన్యుఁడు గాఁడు.

[బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరుఁడు, ఇంద్రుఁడు ప్రవేశింతురు.]

పర—(ఇంద్రునిఁజూచి) ఇంద్రా! కంటివా! ఆజ్వాల బాలుఁడుగా బరిణమించి, సాగరుని హస్తమున నలంకరింపఁ బడినాడు.

బ్రహ—అభవా! ఆబాలుని యపూర్వ తేజమిక్కడకే ప్రకాశించుచున్నది.

విష్ణు—మనమా సాగరుని సమీపించి బాలునిఁ జూతము.

[అందఱును సాగరుని సమీపింతురు]

సాగ—(తనలో) త్రిమూర్తులు నన్ను గృతార్థునిఁ జేయుటకుఁ గాబోలిట్లు వచ్చుచున్నారు. (బ్రహ్మాదుల కెదురేగి ముందు విష్ణుమూర్తి నింగాంచి)

సీ. నీలనీరదగాత్ర ♦ నిర్జరవనజైత్ర,
శంకరస్తుతిపాత్ర ♦ సచ్చరిత్ర
వైజయంతీ దామ ♦ వర్ణితసుత్రామ,
కల్యాణనామ లో ♦ కాభిరామ
భక్తసంరక్షక ♦ పాపరజఃపూష,
శ్రీయుతవక్ష శి ♦ క్షితవిపక్ష
సర్వలోకాధార ♦ సంశ్రితమందార
నిగమాంత సంచార ♦ నిర్వికార
తే. గీ. నన్ను ధన్యునింజేయ మ ♦ నంబునందు
నెంచి వీరితోఁగూడ నే ♦ తెంచినావు
పావనంబయ్యె నాజన్మ ♦ పరమపురుష
యోగిహృద్ధ్యేయ జగదేక ♦ భాగధేయ.

(పరమేశ్వరునిఁజేరి.)

మ. కరుణామూర్తిని భూతనాయకుని స ♦ త్కైలాసవాసున్ సదా
సురసంసేవిత పాదపద్మ యుగళున్ ♦ శుద్ధాత్ము శైవాత్మజా
వరునిన్ బాపవిదూరు, భక్తసులభున్ ♦ భావోద్భవారిన్ నినున్
బరమామోదముతోడఁ జూచితిటనా ♦ భాగ్యంబుసామాన్యమే.

(బ్రహ్మనుజూచి) భారతీరమణా! వేల్పులఁ బెద్దవగు నీవుగూడ నియ్యెడకరుదెంచుటంజేసి నేను గృతార్థుఁడ నైతిని. (ఇంద్రునిగాంచి) అమరేంద్రా! నీరాక నాకెంతయు మోదావహమయ్యె, [అందఱినిఁజూచి]

ఉ. ఓమహనీయులార, విబు ♦ ధోత్తములార! త్వదాత్మలందు, స
త్ప్రేమనుఁబూని నాపయిన ♦ వేడ్కలరారఁగవచ్చినారు నే

నేమియొనర్పఁగావలెను • నెయ్యదికార్యము యానతిచ్చినన్
మీమదికిన్ ముదంబుగను • మేలు ఘటింతును భక్తిమీఱఁగన్

బ్రహ్మ—(తనలో) మహేశ్వరుని కోపానలజ్వాలయే శిశువై యొప్పెనని యీసాగరునకు దెలియదు. (ప్రకాశముగా) రత్నాకరుండ వగు నీకు మాయందంత ప్రేమయుండ, మాకేమి కొఱత? (బాలునిఁ జూచుచు) సాగరా! తన యపూర్వ తేజంబుచే దిశలను వెలిగించు చున్న యీ బాలుడెవ్వరో యెఱుంగ వచ్చునా?

సాగ—దేవా! నాకును దెలియదు. ఇట్టి సుందర రూపునినేను మున్నెచ్చటను జూచి యుండలేదు. ఇంతకుమున్నె నే నీతనిం గాంచి మదీయపూర్వ పుణ్యమున నీసూనుఁడు లభించెఁగదాయని పరమా మోదము నందుచుంటిని.

విష్ణు—శంకరుని కోపానలజ్వాలయే యీ బాలునిగా మారెను. ఆహా! ఏమి! ఈకుమారుని సౌందర్యము నయనపర్వముగనున్నది. సాగరా! కుమారుని నొకసారి యిటుదెమ్ము. ముద్దాడఁగోర్కెయయ్యె.

సాగ—(విష్ణుమూర్తి చేతికిఁ గుమారునిచ్చును.)

(విష్ణుమూర్తి కుమారుని నెత్తుకొనినంతనే యాకుమారుఁడు రాక్షసరూపము ధరించి విష్ణుమూర్తిమీద కేగును.)

విష్ణు—ఆ! ఏమి! ఈమాయ. నిఖిలదైత్య సంహారుఁడనగు నా యొద్దనా యీమాయ. ఇదిగో! చక్రముచేనిప్పుడే ఖండించెద గాక! (చక్రము వదలనెంచును)

బ్రహ్మ—(వారించి) కమలనాభా! నీచిత్తము నాయుద్యమము నుండి మఱల్పుము. ఈతఁడు వధార్హుండుగాడు. (రహస్యముగా) రుద్రుని రౌద్రజ్వాలవలన జనించిన యీతనిని నీవు మడియించితివేని యమ్మహాత్ముని మనంబు చిన్నబోవును. (పరమేశ్వరుఁ జూచి) పరమే శ్వరా! ఈతఁడు భవత్క్రోధానల జ్వాలవలన ప్రాదుర్భవించి

జలముచే ధరింపఁబడెనుగాన, జలంధరనామధేయంబున భాసిల్లును. (జలంధరుని జూచి) జలంధరా! సంగ్రామమున నీవెట్టివారినయిన జయింపఁగల శక్తిఁ బ్రసాదించితిని. మాకరుణచే నీకఖిలభాగ్యంబు లొదవును. విశ్వకర్మ మా యానతిని నీకై యీప్రాంతమున నొక పురము నిర్మించును. నీ వందుండుము.

పర—జలంధరా!

సీ. ధర్మంబె యాతప ♦ త్రముగాఁగ, నఖిల బు
ధానురాగంబె సిం ♦ హాసనముగ
మునివరాశీస్సు సం ♦ జామరంబుగ న్యాయ
వృత్తియే కరమున ♦ గత్తిగాఁగ
నఖిలదిక్కులఁ బ్రాకు ♦ యశమె చేలముగాఁగ
ధర్మసంధతజయ ♦ ధ్వజముగాఁగ
రారాజు జోహార్లు ♦ నీ రాజసముగాఁగ
తేజమే ఘనమైన ♦ దివ్వెగాఁగ
తే. గీ. లక్ష్మి నీయింట నెప్పుడు ♦ లలి నసింప
నజుఁడు బ్రేమను నీకు బూ ♦ ర్ణాయువీయ
శ్రీసతీరమణుండు ర ♦ క్షించిమించ
ధరణిఁ బాలింపు మాచంద్ర ♦ తారకముగ.

జల—దేవా కృతార్థుడనైతిని.

పర—(బ్రహ్మనుజూచి) భారతీరమణా! జలంధరునికై పురము నిర్మించుటకు విశ్వకర్మనుత్వరగా నియమింపవలయును. (తక్కిన వారి జూచి) మహేంద్రా! శ్రీహరీ! ఇంక మన నెలవులకుఁ బోవుదము. (సాగరుని జూచి) సాగరా! ఇఁకఁ మేము పోయి వచ్చెదము.

[అందఱును నిష్క్రమింతురు.]

ఇది ప్రథమాంకము.



# సతీతులసి.

## ద్వితీయాంకము

రంగము:—(1) [తొందరగా జలంధరుఁడు ముందును. వెనుక నారదుఁడును బ్రవేశింతురు.]

జలం—

ఉ. ఇష్టములేని పెండ్లి యది • యేటికి నాకును, నామెకెంతయో
కష్టము దోఁచియుండుటను • గాదె తదీయ మనంబు నిష్ఠురన్
స్పష్టముసేయ నీగతి నొ • నర్చుచు దీని కతాన నాకునే
నష్టము గల్గునో యికను • నాపురికేఁగెద సత్వరంబుగన్.

ఏమైననేమి? నేనామెను స్వీకరింప నక్కడీ భయమేల? నా దారిని నేనుబోయెద. (తొందరగా నడుచుచున్నాఁడు)

నార—ఆ! ఆ! జలంధరా! నిలుపుము. నిలుపుము (జలంధరుని సమీపించును.)

జలం—మునీంద్రా! నన్నాపవలదు.

నార—సమస్తమును దెలిసిన నీవిట్లుఁజేసిన నే నేమనఁగలను?

మ. గళమందున్ వరపుష్ప దామమిడఁగా • గాంక్షించియున్నంతనే
పడియెన్ గ్రిందికి జారి యందులకు భా • వంబందు నిబ్బంగి నీ
వలుకన్ బూని వివాహమొల్లననుచున్ • బల్కంగ భావ్యంబె యా
పలుకుల్ విన్నను నెవ్వరైన నిను నే • బాసంచు శ్లాఘింతురే.

ఎట్టివారికైనను నొకసమయమున పొరబాటుగలుగుచుండును బృంద యుద్దేశపూర్వకముగాఁ బూలహారము నేలఁ బడవైచినదని నీవు తలంచుట యెంతయు దోషము. అట్టి యుద్దేశమున్నచో నీగళంబునఁ బూలహారముచే నలంకరించుట కామె యేల తలంచును?

జలం—మునీంద్రా! నీవేల యీలీలఁబలికి నాచిత్తమును మఱలింపఁ జూచెదవు?

తే. గీ. శుభసమయ మిది యౌను నా • సుదతి కెఱుక
లేక యున్నదె, యెఱిఁగియు • లేమ యిట్లొ
నర్చుటది నాకు సంపూర్ణమం • గళముగాఁగ
దోచకుండునె యిందు నా • దోసమేమి.

చేత దాల్చియున్న పూవుమాల జాఱి క్రిందఁబడుట కది సూచకమా చారమా! అయినను నిప్పుడా తర్జనభర్జనలేల? ఇట్టి యమంగళకార్యము జరుగుటఁ జేసి యాబృందను, గ్రహించుటకు నాచిత్తము సమ్మతింపదు. ఇంక నాకనుజ్ఞనిమ్ము. నాపురమునకు మరలి పోయెదను.

నార—జలంధరా! ఏపనిఁ జేసినను జగము మెచ్చునట్లుండ వలయును.

ఉ. గారము నీపయిన్ నిలిపి • క్ష్మాతలనాథు లెల్లరన్ దిర
స్కారమొనర్చి నిన్ను విభు • గా వరియింపఁగ గోరినట్టి యా
సారసనేత్రి కీగతి వి • చారము గూర్చుట ధర్మమౌనె ని
వారయ వేల దీనిఁ బరి • యాచకమా యిటు సేయ భూవరా.

ఆబృందకు నీయందుఁ జిత్తముండుట చేతనే కదా స్వయంవరార్థమై వచ్చిన రాజుల నందఱను నొల్లక, నీగళంబుననే పుష్పదామము వేయనెంచెను! అట్టిచో చేజాఱి యాపూలదండ క్రిందపడినంతమాత్రమున నిగతిని నాస్వయంవర సభను విడిచివత్తువా? నీయలుక మణికుండలున కెంత విచారమునో కలుగఁజేసెను గదా! బృంద పరితాపము చెప్పఁ దరముగాదు.

మ. జలజాతాక్షినిఁ బద్మగంధి నవలన్ • శాతోదరిన్ సుందరిన్
విలసత్పూర్ణ శశాంక బింబవదనన్ • విద్యుత్ప్రవాళాధరిన్
కలకంఠిన్ భవదీయ దాస్యకలనా • కామన్ జగన్మోహినిన్
గలికిన్ బృందను నేఁ గ్రహించి సుయశః • కల్యాణిఁ జేపట్టుమా.

జలం — తాపసోత్తమా! నీవెంత చెప్పినను నాచిత్తమా బృందను గ్రహించుట కావంతయు సమ్మతించుటలేదు. ఇష్టములేని పెండ్లి వలన నెట్టిదోసంగు కలుగునోకదా! నాయందుఁ గరుణించి యీవిషయమున నన్ను బలవంత పెట్టవలదు.

నాగ — ఓయీ! వెఱ్ఱివాడ!

తే. గీ. శకునములు స్వప్నములు గ్రహ • చారములును
వినుము నీవంటివారికిఁ • భీతిగొల్పఁ
జాలవుఁ పిఱికివారల • స్వాంతములనె
కలఁచుచుండును నియ్యది • తెలియవొక్కొ.

దీనివలన నీకావంతయు నశుభము గలుగదు. విశేషించి దీనివలన నీకు యశము గలుగుననియే నేను నొక్కి వక్కాణింపఁ గలను.

జలం — తాపసపుంగవా! నాగళంబున నలంకరింపఁబడదగిన పువ్వు హారము బృంద చేతినుండి జాఱుటంజేసి, ముందేదియో కీడు నాకు ఘటిల్లునని చిత్తమున బెంగనాటికొనినది. అట్టిచో దీని నిప్పుడు పరకుసేయక ముందు శుభంబే యొదవునని నీవు చెప్పెడు మాటలకు నాచిత్తమున నెట్లు ధైర్యము నిలుచును? ముందు వచ్చు శుభమేమో దెలియదుగాని, యిప్పుడు జరిగిన కార్యమును బట్టి మాత్రము కీడొదవునని తోచుచున్నది. ఇటువినుము.

తే. గీ. కానరానట్టి శుభమొందు • గలుగుననుచు
కనులకును దోచు కీడెదు • రొక్కనఁగలండె

తాతగట్టిన మేల్బ్రావి • తప్పదనుచు
నప్పునీరును ద్రాగెడి • మొప్పెగలఁడె.

నార—జలంధరా! ఇవి యస్ప్రియము ననవసరమైన యుత్తరప్రత్యుత్తరములు. బ్రహ్మమానస పుత్త్రుఁడనైన నావచనంబుల విశ్వసింపుము అనుమానమే నిన్ను బాధించుచున్నది గాని మఱియొకటి కాదు. నీవిప్పుడిట్టి యకార్యమొనరించితివేని లోకమునందు దలయెత్తి మెలంగఁ జాలవు. ఇదియుంగాక విరించి కరుణాసమాసాదిత మహాపరాక్రమవంతుండవైన నీకేమిభయము! ఇంక బ్రతివచనము జెప్పక వచ్చి బృందం గానుము (ఎదుటఁజూచి) అదిగో! చూడుము.

సీ. నలయితపరివార • జలదాంతరంబున
దీపించు క్రొమ్మించు • దీవయనఁగ
నబ్ధిమధన సమ • యంబునఁ బ్రాదుర్భ
వంబునందిన రమా • బ్జాన్యయనఁగ
నఖిల భూవరవ్యాద్బి • దార్ఢంబు విధిసృజి,
యించి పంపించు మో • హినియనంగ
[illegible]జనాధు డాయ హ్వా • న్నీరజంబున నెంచి
కుతుకంబుతో వచ్చు • రతియనంగ

తే. గీ. నలస్వయంవర రంగంబు • నందు విరుల
దండతో నిల్చి యున్నది • తన్వి బృంద
కాన నామె మదికి హర్ష • మలరునట్లు
శంక విడనాడి రమ్మింక • జాప్యతలేంద్ర.

మ. శరదాఖ్యాబ్జ దళాక్షి భూరివిమల • చ్ఛాయాకలాపంబుచే
నరవిందారి నలంకరించు గతిఁదా • నాత్మీయహస్తాగ్రభా
క్స్వరి పుల్లాబ్జలతాంత దామకముచే • గైసేసి యాబృంద సు
స్థిరభక్తిన్ నిను బూజసేయగను వే • చేరమ్ము భూపాలకా.

ఇంక మనంబున మఱియొక విధమైనశంకఁ బెట్టుకొనకరమ్మా. (చేయిబట్టుకొని తీసికొనిపోవును.)

రంగము:—2 [మందిరమున—మణికుండలుఁడు-బృంద-జలంధరుఁడు]

మణి—(జలంధరునిఁ జూచి)జలంధరా! స్వయంవరమందిరమున నా తనూజవలన జరిగిన యపరాధమును మఱచిపొమ్ము. (ఇంచుక యూరకుండి)

ఉ. మామక భాగధేయగరి • మంబున నీచెలిజన్మమందె, నీ
తామరసాయతేక్షణ క • తంబున దావక బాంధవానుబం
ధామితవైభవంబు వెస • నబ్బెఁగృతార్థుఁడ నైతినింక నీ,
శ్యామను గూర్మినేలు కొను • మయ్య జలంధర భూమినాయకా!

(బృందను జూచి) అమ్మా! బృందా! భవదీయపూర్వ పుణ్యవిశేషమున నీజలంధరుఁడు నీకుఁ బ్రాణేశ్వరుండై నాఁడు. సకల మెఱింగిన నీకు నేనేమియుఁ జెప్పనక్కఱలేదు. అయినను వాత్సల్యమునఁ జేసి చెప్పుచుంటిని.

సీ. భయభక్తులను బూని • పరమానురాగవై
చెలువుని కన్నుల • స్నల మెలంగి
చిత్తమం దేవేళ • బత్తి పెంపొందఁగా
వృద్ధులకును సేవ • వెలయఁజేసి
యాప్తబంధు జనాళి • నాదరంబునఁ గాంచి,
మృదుభాషణముల స • మ్మోద మొసంగి
గర్వమింతయు లేక • కరుణతో నతిథుల,
నిష్టమృష్టాన్న సం • తృప్తిదేల్చి

తే. గీ. కరుణవీడక సత్యంబు • మఱువకుండ
నిట్టి సాధ్వీలోకంబున • నెందు లేద
టంచుఁ బ్రజలెల్ల వినుతించు • నట్టిభంగి
నుభయకుల పవిత్రవగుచు • నొప్పుమయ్య.

మ. అనిశంబున్ రమణప్రియా చరణ కా • ర్యాయత్త చిత్తాబ్జవై
యనువర్తించి జగంబులందున మహో • ఖ్యాతిన్ బ్రవర్తించి రా

యనఘస్వాంతలు భూరిశాంత లనసూ • యారుంధతీకాంతలం
గన! నీవట్లు సుకీర్తిఁ జేకొనఁ దగుం • గా భర్తృసేవారతిన్.

మ. ఆర్యులటన్న మేల్ వ్రతము • లన్నను దేవతలన్న శాశ్వతై
శ్వర్యములన్న నిర్మలయ • శంబులటన్నను, బంధులన్న, స
త్కార్యములన్న భాగ్య సుకృ • తంబులటన్నఁగుమారి నీకు, నీ
యార్యసుతుండె సర్వమని • యాత్మదలంచి చరింపుమమ్మరో.

చ॥ సతివయి జన్మగోత్రము • యశంబలరింపుము మావధూటివై
స్థితనిజవల్లభాలయము • చెన్నువహింప నొనర్పు మక్కలా
పతివయిపాణి నాథువర • భావ కుతూహల మాచరింపు మీ
గతి విలసిల్లినన్ వినుము • ఖ్యాతివహింతువు లోకమందునన్.

బృంద—తండ్రి! నీయుపదేశ వాక్యములు నాహృదయ ఫలకమున లిఖించుకొని యుందును.

మణి—(జలంధరునిఁజూచి)

సీ. జననమందిన దాది • జననిని నెన్నఁడు,
విడనాడి యెఱుఁగని • విద్రుమోష్ఠి
పురమును నేఁబాసి • యరిగినప్పుడు నాదు,
శోకకై వేచెదు • రాజవదన
యెండకన్నన నేమొ • యెన్నఁడెఱుంగక,
సౌఖ్యంబులందెడి • జలజనయన
కోపంబునొక్కింత • చూపిన గన్నుల,
నశ్రువుల్ నించెడి • యతివమిన్న

తే. గీ. మామకతనూజ యీసతి • మాన్యచరిత
భార్య యయ్యెను నీకు నే • భంగిదీని
నరసి రక్షింతు వోకృపా • కరుఁడవగుచు
భారమంతయు నీయదే • పార్థివేంద్ర.

ఉ. ఆకలి గొన్నఁదానడుగ • దన్నము కుత్తుకయొండి యుండినన్
గైకొన బోదు దాహమును • గన్గొని పెద్దలె యివ్వగావలెన్
మాకును జెప్పదేమియును • మాన్యచరిత్రి సుశీల నామె నీ
వేకరణిన్ కృపారసము • నింపుచు నింపుగనేలెదో కదా.

జలం—(తనలో) నాకీతని పలుకులే వినబడు చుండుటలేదు. పుష్పహార మీామె కరమునుండి పడినంతనే నాకీయువిద యందున్న మోహామే పోయినది. ఆనారదుని వాక్యము నతిక్రమింప జాలక యీామెను గ్రహించితిని. (ప్రకాశముగా) నృపాలా ఇంక మేముపోయి వచ్చెదము.

బృంద—తండ్రీ! నాధుని వెంటనరిగెదను. (విచారించును.)

మణి—కుమారీ! చింతింపకుము. లోకైక వీరుండగు జలంధరుఁడు నీకు భర్తయయ్యె. నీభాగ్యము వర్ణింపఁదరముకాదు. అప్పుడప్పుడు నీకుశలవార్తల దెప్పించుకొనుచుందుము. మేమునువచ్చి చూచుచుందుము. నీకిచ్చటనుండి కావలసిన యమూల్య వస్తుచయమును బంపుచుందుము. నిపతియనుజ్ఞవడసి తీసికొని వచ్చుచుందుము.

జలం—రాజేంద్రా! ఇంక మేమరిగెదము.

మణి—శుభమగుఁగాక. పోయిరండు.

[అందఱును నిష్క్రమింతురు.]

రంగము:—౩. [వనము - ప్రవేశము - బృంద]

బృంద—(తనలో) ఎంతభాగ్యముండిననేమి? ఎట్టిసౌఖ్యములు గలుగుచుండిననేమి? అగ్నిహోత్రుని సాక్షిగఁ గొన్న సతి పతిచే నిరాకరింపఁ బడినప్పు డివియన్నియు నిరర్థకములుగదా! అక్కటా నాభర్త కృత్యములకు నేనేమని చింతింతును? బ్రహ్మ వరప్రసాదిత మహారాజ్య బలసంపన్నుఁడనియు, సుగుణమూర్తియనియు దలంచి,

మనసార వివాహమాడితినిగాని యిట్లగునని కలనైనఁ దలంప
నైతినిగదా!

తే. గీ. ఎట్టిసౌందర్యముండిన ♦ నేమి? యెట్టి
భాగ్యములు గల్గిననునేమి ♦ భర్త చేత
జూడఁగాఁ బడనట్టి యా ♦ సుదతి బ్రదుకు
కానఁ గాచిన వెన్నెల ♦ కరణిగాదె.

నాసాధునకు నాయందనురాగము లేకపోయినఁ బోవుగాక! పరసతులభంగము సేయు తలంపు మానుమని యెంత చెప్పినను వినడయ్యె. మునియాశ్రమంబుల బ్రవేశించి వారాశ్రమమున లేనితరిని దత్పత్నుల బలిమిం బట్టవలంచుచుండును. పరనారి కంటఁబడుట భయముగానున్నది. ఈ దురుద్యోగమునుండి యాతని చిత్తము ద్రిప్పుటకెంత ప్రయత్నించినను నాప్రయత్నము కొనసాగకయున్నది.

సీ. తనుజేరి నామీద ♦ నెనరుంచుమని వేడ
వినడాయె, దాయఁగాఁ ♦ గనుచు నన్ను
పరకాంత గవయుట ♦ పాపమంచును నెంచ
డాయెగాఁ నేనెంతో ♦ డాసి పలుక
మానులనేచుట ♦ మానుమంచును గోర
మానడాయె ముదంబు ♦ బూనుగాని
వరధర్మపథమందు ♦ వర్తింపుమని పల్క
గొనఁడాయె నాపల్కు ♦ గోపమూని

తే. గీ. ఎంత వేడినఁగాని కా ♦ సంతయైన
మనసు కరుగదు నామీద ♦ మన్మనోవి
భునకు; నేమిసేయుదు నేరి ♦ బ్రోవ వేడు
దానఁ, బ్రాణేశ్వరుని మంచి ♦ దారిఁబెట్ట.

ఇదియంతయు నేను తొలిజన్మమునఁ జేసిన పాపమీవిధముగఁ బరిణమించినది. ఇంతకును భగవదాజ్ఞకు నన్యథా జరుగ నేరదుకదా! శక్తివంచనలేకుండ నాజీవితేశ్వరుని సన్మార్గమునఁ బెట్టఁజూచెదను.

( తె ర లో )

దేవీ! బృందా! బృందా!

బృంద—(ఎదుటఁజూచి) అదిగో! నన్నరయుచు నవమాలిక వచ్చుచున్నది.

నవమాలిక—(ప్రవేశించి) దేవీ! బృందా! నీవాజలజాకర తీరంబున నుంటివేమోయని తలంచితిని.

బృంద—లేదు. ఇక్కడనే యుంటిని.

నవ—దేవీ! మన మొక్కింత కాల మీావనంబునఁ జరింతమా అటుజూడుము. ఉల్లంబులు రంజిల నెల్లెడఁ గొల్లగ బూసియున్న మల్లెలును, మిగుల సువాసనచే నెగడుచుఁ జెట్లక్రిందఁ బడియున్న పొగడలును, మదనుని కరంబుననుండు బాకులోయనంబడు కేతకీపుష్పములును, మొదలగు సమస్త విరులును సంపూర్ణముగ పూచియున్నవి.

బృంద—(తనలో) నాచిత్తము వనవిహారమునకు సమ్మతించునా? నిరంతరమును నా మనోహరునిఁ గూర్చిన చింతయేగాని మఱియొక విధమగు చింతయేలేదు. అయినను నాపరితాప మీానవమాలిక యెఱుఁగనేల? ఇట్టిది యొకరు వినవలసినది కాదు. (ప్రకాశముగా) నవమాలికా! ఆ పుష్ప సంతతులకేమిగాని యిటు జూడుము. చిలుక ముక్కులచే నొక్కఁబడి, కెంపురుచులీను చున్న దాడిమ ఫలంబులెట్లున్నవో ఆహా! వనరామణీయము కన్నులకు బందువై యున్నది.

మ. స్వనితాంతాహతికోర్వలేకను తరు ♦ చ్ఛాయాపదేశంబుచే
త నరణ్యంబున డాగియుండు బహుళ ♦ ధ్వాంతంబులన్ రూపుమా
ప ననేకా కృతులన్ ధరించి యునుఁడీ ♦ వన్యన్ బ్రవేశించెనో
యన శోణద్యుతితో ఫలావళులు నిం ♦ డారెన్ వహీజంబులన్.

ఇదిగో! ఈప్రక్కకువచ్చి, సకలసురమునిరాజ పూజానిదానములును, మిళిందవ్రజవిధానములును. స్వదర్శన ప్రఖేదిత విరహిలోక ప్రతానమానములును నగు సూనంబు లెల్ల మహిత రుచుల నొప్పుచున్నవో చూడుము.

నవ—వానికేమిగాని యిటుచూడుము.

మ. చపలాక్షీ! ఘన సాధ్వివైన నినునో ♦ జన్ జూచి యుక్తాళ్యసీ
కపుగీతంబుల నియ్యశోకలతికా ♦ వారంబునీకున్ బ్రివా
ళపు మాణిక్యమయంపు బాత్రికలఁగాం ♦ తుల్ దీర సూనప్రసీ
పపుబింబూనుచు మంగళారతులిడెన్ ♦ భక్తిప్రపత్తిక్రియన్

బృంద—సఖి! ఆకాసారతీరమున నాబకవ్రజ మెట్లుండునో చూడుము.

నవ—దేవీ! పరాంగనల గవయఁదలంచి చదియుఁజప్పుడు గాకుండ, నిటునటు తాగులాడు విటకాండ్రి చందంబున, మీనంబులఁ బట్టుటకై యాబకములు దొంగతపము సేయుచున్నవి.

[విష్ణుమూర్తి ప్రవేశించును.]

విష్ణు—[తనలో] ఈమె చెలికత్తె నన్నుఁదిలకించెనాయేమి? (పరికించి) లేదు. లేదు. (ఇంచుక యూరకుండి) జగద్రక్షణకార్యదీక్షాధురంధరుఁడనైన నాకీబృందపై మోహము జనించుటకుఁ గారణము నేనే యూహింపఁజాలక యున్నాను.

తే. గీ. సకల భువనములశాసింప ♦ జాలునాకు
బృందపై మోహమీరీతి ♦ వెలయుటేడ?
జగము దీనిని విన్నచో ♦ నగదె? హరియె
యిట్టి దుష్కార్య మొనరించె ♦ నే యటంచు

చిత్తమును నీ యుద్యమమునుండి మఱలించుటకెంత ప్రయత్నించినను మఱలకున్నది. (ఇంచుక యూరకుండి) బృందమహాసాధ్వి.

నిరంతర పతిసేవాపరాయణ. జలంధరుఁడు విరించి వరసంజనితబల గర్వోద్రేకుఁడై చరించుచున్నను, నామె యాతనిని దైవమువలెఁ బూజించుచున్నది. జలంధరుఁడెట్టి దుష్కృత్యముల సేయుచున్నను నా బృంద మంగళసూత్ర మహిమమున నాతఁడేవిధమగు హానియు జెందకయున్నాఁడు. నేనీబృందకు నాయభీష్టము దెలిపెదగాక! ఆమె యందులకు సమ్మతించనేని నామోహాగ్ని చల్లారుటయేగాక దుర్నీతిపరుఁడై యున్న జలంధరుఁడు మడియును. దీనం జేసి దేవతలకు హితముజేసిన వాడనగుదును. అట్లుగాదేని బృందసాధ్వీశిరోమణియను విజయధ్వజముం జగంబున నిలిపిన వాడనగుదును. ఏమైనను బృంద సౌందర్యము నాచిత్తమును సంపూర్తిగా నాకర్షించినది.

తే. గీ. కొమ్మఁగన్నఁ బమ్మకునైన • రిమ్మతెగులుఁ
గలుగుననుమాట నాయందె • నిలచెనిపుడు
గాకయుండిన నేనేడ • కలికికొఱకు
హృదయమున మోహమూని, చ • రించుటేడ

ఆహా! వైకుంఠపురంబెక్కడ! ఈ జలంధరుని పురంబెక్కడ బృందపైనున్న మోహము నన్నింతదూరము కొనివచ్చినది!

బృంద—(చెలికత్తెనుఁజూచి) సఖి నవమాలికా! వనవిహారమిఁక జాలించి గృహమునకుఁ బోవుదమా!

విష్ణు—(తనలో) ఈమె గృహంబున కరుగునాయేమి? ఈమె వెంటనే జెలికత్తెయుండఁగా నేనెట్లు సంభాషించుటకు సాహసింతును?

నవ—బృందా! గృహమున కరుగుటకుఁ దొందరపడవేల? ఆజాజిపువ్వులం గోసికొనివత్తము రమ్ము. (బృందతో నిష్క్రమించును)

విష్ణు—(ఎదుటఁజూచి) ఆహా! ఏమి! ఈమె సౌందర్యము జగన్మోహనమై యున్నది.

మ. త్రిజగన్మోహన కాంతిఁ గొల్పి, తనువుల్ ♦ దీపింప బ్రాభాతనీ
రజ బంధుప్రభ గూర్చి నెమ్మొగము నా ♦ రాకానిశానాథు, న
క్కజమై నవ్వగ జేసి, బృందనిటులో ♦ కంబందు సృష్టించె, నా
యజనిర్మాణపుఁ బ్రౌఢిమెచ్చనగు వ ♦ హ్వా మానసంబందునన్

నిజముగా సృష్టికర్త తన నేర్పంతయు నీమె నిర్మాణమునందుఁ జూపినాడు, అందుచేతనే చతుర్దశ భువనంబులయందుగల సతులకు సౌందర్యమున దలకట్టై యున్నది.

ఉ. ఈ రుచిరాంగి విశ్వధర ♦ ణీంద్ర పురంధ్రులకూడ మించి, వి
స్తారము నందముండునని ♦ ధాత వధూటి లలాటవాటి గిం
కారఁగ వ్రాసెనో యనటు ♦ తోటనె యీ జలజాక్షి కిట్టి యా
కారముగల్గెఁ; గానియెడ ♦ గల్గెనె వేరొక కాంత కెందునన్.

(పరికించి) కాంతామణి సౌందర్యమెంత చూచినను దనివిదీరకున్నది.

సీ. పద్మాస్య వేణితో ♦ బ్రతిగాక కాబోలు,
వల్మీకములఁ జేరె ♦ ఫణులపంక్తి
తరళాక్షి మోముతో ♦ సరిరాక కాబోలు,
బహుళార్తి నుర్వెక్కెను ♦ పద్మవైరి
యింతి చందోయితో ♦ నెనగాక కాబోలు,
గాసులువాసె నల ప ♦ ర్వతపుసమితి
కపికి నెన్నడుముతో ♦ దులగాక కాబోలు,
చేరె గుహాలయందు ♦ సింహతతులు
తే. గీ. పొలతికుఱుఖ్ఖలకోడి కా ♦ బోలనంట్లు
తలలు వంచుకొని నిలిచె ♦ దఱుణి పాద
ములకు సదృశంబుగాక కా ♦ బోలు కమల
గణము పంకోదయావాప్తి ♦ గాంచియుండె.

ఈ యాకృతిం గాంచి యెట్టివారైనను మోహసాగరంబున బడుట నిశ్చయము.

తే. గీ. కామ రహితుఁడయిన మోక్ష • కామియైన
నిర్మలాత్మునండె యైనను • నిపుణుఁడైన
నమిత వేదాంత విదుఁడైన • ననఘుఁడైన
నువిదఁగాంచిన మోహంబు • నొందకున్నె,

(పరికించి) అదిగో! బృంద చెలికత్తె పూవులంగోసికొని యామెతో నేమియో చెప్పుచున్నది. ఇఁక నామె గృహంబున కేగునో యేమి! (మరలఁజూచి) చెలికత్తెతో మరల నేమియో పలుకుచున్నది.

( తె ర లో )

నవమాలికా! నీ వీ పూవులంగొని గృహంబున కరుగుము, నేను భగవంతుడగు శ్రీమన్నారాయణుని పూజార్థమై ప్రత్యేకముగఁ గొన్ని పుష్పములు సంగ్రహించుకొని వచ్చెదను.

విష్ణు—(తనలో) అదిగో! ఈమె చెలికత్తెను గృహమునకుఁ బంపివేసి, తాదీయ పూజార్థమై విరులం గోయ నీ ప్రక్కకు వచ్చుచున్నది. ఈమెం జేరి భాషించుట కిది యెంతయు మంచి సమయము.

[బృంద - ప్రవేశించును.]

బృంద—(తనలో) నవమాలికను గృహంబునకుఁ బంపితిని. విష్ణునకుఁ బ్రీతియగు నా పుష్పములను గోసికొని నేనుగూడ సత్వరంబుగ నరిగెదఁగాక!

(పూవులు గోయుచుండును)

విష్ణు—(తనలో)

మ. అకలంకోజ్జ్వల గాత్రియై తనరు నీ • యంభోజపత్రాక్షి మా
మక సమ్మోహ కలావిశేషమును బెం • పంగానిటం జేరె, నే
నిఁక సందేహమునంతియుక్ విడిచి యీ • హేమాంగినిం జేరి; మా
మక మోహంబెఱిగించి సమ్ముదమునం • భాసిల్లగాఁ జూచెదక్.

నేనీమె కింటబడెదఁగాక. (బృందయెదుటకు బోవును.)

బృంద—(విష్ణుమూర్తిని జూచి తనలో) ఎవ్వరీ పురుషుడు? శుద్ధాంతకాంతనగు నే విహరించు నీ వనంబునఁ బ్రవేశించెను. చెలికత్తెనుగూడ గృహంబునకుఁ బంపితిని. (ఇంచుక యాపలకుఁబోయి) ఆహా! ఈ మహాత్ముని తేజము వనంబంతయుఁ బ్రకాశింపఁజేయుచున్నది ఈ దివ్యపురుషుం డెవ్వఁడో కదా! ఆలోచించిచూడ నీ మహానుభావుఁడు త్రిమూర్తులలో నొక్కఁడై యుండును. మదీయ పురాకృత సుకృతంబునం జేసి శ్రీహరియే యిట్లు సాక్షాత్కరించి యుండెనని తలంతు (ఇంచుక యూరకుండి) నా హృదయమున నదియొక విధమగు భయముగూడ జనించుచున్నది. ఏమైనను బరపురుషుఁడగు నితనితో నెట్లు భాషింతును? నేనిఁక సత్వరముగ గృహమున కరుగుటయే మంచిది. (పోబోవును)

విష్ణు—(ఎదురై) బృందా! నిలువుము. నిలువుము.

బృంద—(ఇంచుక భయమునటించి) ఈ మహానుభావుఁ డెవ్వరో నన్ను నిలువరించినాఁడు. ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) ఈ పుణ్యమూర్తి యెవ్వరో యరసెదఁగాక! ఇంతమాత్రమున నాశీలమున కేమి భంగమొదవును? (ప్రకాశముగా)

మ. కమలాకాంతుఁడవో! ప్రభాకరుఁడవో • కామారివో భారతీ
రమణీనాథుఁడవో శచీపతివొ తా • రాభర్తవో, నీదు తే
జము నిండెన్ దిశలెల్ల, యెవ్వఁడవు, యీ • చందంబునన్ వచ్చినా
వు? మహాత్మా! కరుణన్ వచింపుము నినున్ • బాల్పారఁ బ్రార్థించెదన్.

విష్ణు—తరుణీమణీ! ఇప్పుడు నీవు చెప్పినవారిలో నొక్కఁడను.

తే. గీ. భక్తమానసపీఠి ని • వాసభూమి
భక్తరక్షణ కార్యంబు • పరమ హితము
నఖిల దేవతాతతి నాకు • నాప్తసఖులు
గాఁగ జెలగుచుండును నేను • కంబుకంఠి.

చ. మనమున సంతతంబును స ♦ మంచితభక్తి నిబూనుచుఁ దురం
తనిరతిన్ భజించెడి బు ♦ ధప్రకరంబున కిష్టవైభవం
బును ఘటియించుచుందుఁ బరి ♦ పూర్ణకృపారసధారఁ జిల్కుచున్
వనరుహపత్రనేత్రి నను ♦ భావమునందు గ్రహింపకుంటివే?

బృంద—(తనలో) ఈతని పలుకులు మర్మగర్భితములుగనున్నవి. ఈతని జగదానందకరంబగు రూపముజూడగా శ్రీమన్నారాయణుఁడని తలంచెదను. మదీయ సుకృతంబునఁ జేసి, యీ పుణ్యమూర్తి నన్ను గృతార్థురాలుగాఁ జేయ నియ్యెడకు విచ్చేసియుండును. (ఆలోచించుచుండును)

విష్ణు—ఓ కుటిలకుంతలా! ఆలోచించుచుంటివేమి? ఎవని పూజార్థమై యిప్పుడీ పుష్పములను నీవు గ్రహించుచుంటివో, యతనిగ నన్ను భావింపుము.

బృంద—(సంతోషముతో తనలో) నేడు నా పుణ్యము పండినది. ఇమ్మహాత్ముఁడు సాక్షాదిందిరా నాథుఁడు. (తనలో)

సీ. ఫాలార్థచంద్రుపైఁ ♦ బ్రాపించు నీలాభ్రి,
కోటినా నెగడు ముం ♦ గురులవాని
రమణీయలావణ్య ♦ రససరసిజసీమ,
తొగలు నాటనవకం ♦ దోయివాని
కంతుండముల నేలి ♦ పరమభక్తులకు సం,
తత మభయమిడు హ ♦ స్తములవాని
వజ్రపంజరనిభం ♦ బై సంతతంబును,
సిరికాట పట్టైన ♦ యురమువాని

తే. గీ. అఖిలలోకములకు మూల ♦ మైనవాని
కలితభక్తరక్షణ దీక్ష ♦ గలుగువాని
నిఖిలమునిజన సన్నుతి ♦ నెగడువాని
నాదినారాయణుని గంటి ♦ నా రిదీర.

ద్వితీయాంకము.

(ప్రకాశముగాఁ గరములు మోడ్చి)

సీ. కలశవారాశి యే ♦ లలిత చరితునకుఁ
జావనంబైన ని ♦ వాసభూమి
వేయి జిహ్వలుగల్గి ♦ వెలయు శేషాహియే,
ధీరగుణుండు ని ♦ ద్రించుపాన్పు
వినతాద కేవ్వఁడు ♦ వెంటనేయుండెడి
పక్షీంద్రుఁ డెవ్వాని ♦ వాహనంబు
సకలజనతతి కై ♦ శ్వర్యమ్ము నొసగెడి,
యిందిరాజలజాక్షి ♦ యెవని దేవి

తే. గీ. వర సురలుమును లెవ్వని ♦ వందిజనులు
భక్తరక్షణ మెవ్వాని ♦ పరమహితము
నట్టి, లోకైకనాధుని ♦ నమలచరితుఁ
గాంచఁగంటిని కన్నుల ♦ కలవుదీఱ.

దేవా! శ్రీమన్నారాయణా! పరమనిష్ఠాగరిష్ఠులైన ఘోరతపం బొనర్చు మునీంద్రుల కయినను లభింపని నీదివ్యమంగళ విగ్రహసందర్శనము నేడునాకు లభించినది. జగద్రక్షుండవగు నిన్నుబూజించు క్రమముగూడ దెలియని యజ్ఞానురాలను నన్నెట్లు రక్షించెదవో!

విష్ణు—సతిమణీ! బృందా! నేను భక్తసులభుఁడను. నీపైన నాకున్న యనురాగమే యిట్లు సాక్షాత్కరింపఁ జేసినది.

బృంద— దేవా! లక్ష్మీకళత్రా!

మ. సరసీజాత భవాది శంకరులె, న ♦ శ్రాంతంబు సేవింపఁ జె
ల్లిరవై మించు మహాను భావుఁడవు నీ ♦ విబ్భంగి నన్నుంగనన్
వరకారుణ్యము బూని నీదు నిజరూ ♦ పస్ఫూర్తితో వచ్చుట
ద్దిర భాగీరథి చొటినేల పయిన ♦ ద్ధిన్ బాఱినట్లేకదా.

విష్ణు—చకితాక్షీ! ఇంకు నీవునన్ను వినుతింపవలసిన పని యేమియునులేదు. నిరంతరము నీచిత్తము నాపైన నిలిపియున్న దానవ గుటంజేసి భక్తభావంబున నీకు నేను గట్టుబడితిని. భక్తులెవ్వరును నన్నింత సులభముగా వశముఁజేసికొని యుండలేదు.

బృంద—మహాత్మా? నాపై నీకు నిట్టికరుణ జనించినదిగాని, నిరాహారులై వాయుభక్షణ సేయుచు మహారణ్యములందు పరమ నిష్టనుబూని ఘోరతపము జేసిన తాపసోత్తములకంటె నేనెక్కువ దాననా?

విష్ణు—(తనలో) నెమ్మదిగా నాహృదయమూ మోహఁ దెలియఁ జేసెదఁగాక! (ప్రకాశముగా) బృందా! నన్నుఁ గట్టివేసినది నీభక్తి పాశమొక్కటియే కాదు.

బృంద— కేవలమూఢమతినగు నేనెట్లు భక్తురాలనని చెప్పు దును? ఆర్తరక్షణా! ఇందు నీకరుణా విశేషముతప్ప వేఱొకటి లేదు.

విష్ణు—అదియును గాదు.

బృంద—దేవా! ఇక నేనేమని చెప్పగలను?

మ. వనజదళేక్షణా! విమల • భక్తజనావన! నీదుదివ్య ద
ర్శనమున మత్కఠోర కలు • ష పరికరంబు దొలంగెజన్మపాగానే
పనత లభించె నిప్పుడు, న వార్య • కృతార్థతగంటి మత్పురా
తనకృత పుణ్యమెట్టిదో క • దా! నిను జూడఁగఁగంటి మాధవా.

విష్ణు—శశివదనా! నన్ను వీక్షించుటంజేసి నీవు కృతార్థురాల వయితివి! నిన్ను వీక్షించుటచేతనేను కృతార్థుఁడ నగుదును.

బృంద—(తనలో) ఈ దేవాదిదేవుఁడిట్లు వచించుచుండె నేమి (ప్రకాశముగా) జగత్కల్యాణమూర్తి వగు నీవు నన్నిట్లుబలు కనగునే

విష్ణు—

మ॥ అతివా! సందియ మింక లేదు విను స • త్యంబిద్ది లక్ష్మీసతీ
పతినై యుండి సమస్తలోకములు బెం • పగ్ జాలి బృందారకుల్
కుతుకంబూనుచు భక్తిమై గొలువనై • కుంఠంబునం దుండు, నే
నతిమోదంబున వచ్చినాడ నిటు నీ • కై యొక్క కార్యార్థమై.

బృంద—మహాత్మా! నీవాక్యము నాకెంతయు వింతఁగొలుపు చున్నది. దేవాదిదేవుండ వగునీవు నాకడకుఁ గార్యార్థివై వచ్చితినని పలికిన నేమనఁగలను?

విష్ణు—నారీమణీ! ఇది నిశ్చయమే! నేను నిన్ను యాచించుటకే వచ్చితిని.

బృంద—సమస్తయాచక జనచకోరచంద్రుఁడవగు నీ వొరుల ను యాచించువాడవా! ఇట్టి వింతగలదా!

సీ॥ రత్నాకరము నీకు • రమణీయ వాసంబు
జీవనంబెంతయో • చెలగుచుండ
ఇందిరాదేవి నీ • హృదయ మందుననిల్చి
ధనమున కేమియు • దఱుగు లేదు
భూదేవి రెండవ • పూబోడి యగుటను
గోరిన పంటల • గురియుచుండు
నిఖిల బృందారకుల్ • నీయాజ్ఞ నుందురు
వలచిన దంతయు • భక్తినిచ్చి

తే॥ గీ॥ అట్టి నీ వేడ! యొరులను • యాచనంబు
సేయుటేడ! నీవాక్యముల్ • చిత్రమయ్యె!
నెందుకీరీతి బల్కితో • యింతయైన
కారణ మెఱుంగకుంటిని • కమలనాభ.

విష్ణు—సుందరవదనా! నేను చెప్పినమాటయందసత్య మావంత యును లేదు. నామనంబున నొకవిషయమైన కోరిక యొదవుటం జేసియే నీకడ కరుదెంచితిని ఆకార్యము నీవలనఁ జక్కబడవలయును.

బృంద—(తనలో) భగవంతుడగు నీశ్రీమన్నారాయణుని వాక్యములయందర్థము నాకుఁదెలియుట లేదు! ఒకవేళ నన్నుఁ బరీక్షింపఁ దలంచి యేదియేని నెరవేర్చుట కవశ్యమైన కోరికఁ గోరడుగదా! (ప్రకాశముగా) దేవా! జగత్కర్తవగు నీకోరిక దీర్చుటకుఁ దగినంత శక్తి గాలనా? నాయందుగరుణ యుంచుటంజేసి యిట్లువచించెదవుగాని, కాకున్న నేనెంతదానను. అయినను గృపాంతరంగుండవై భవదభీష్టమెట్టిదో యానతిచ్చితివేని, నీకరుణకుఁ బాత్రినై యశమందు భాగ్యము నాకుండునేని, చేయఁజూచెదను.

విష్ణు—బృందా! నాయభీష్టము నీవు దీర్పఁదలంచినచో దీర్పఁగలవు; కాని చెప్పుటకు నాచిత్తమే యొక్కింత వెనుదీయుచున్నది.

బృంద—మహాత్మా! భక్తులయందట్టి సందియము నీకుండఁగూడదుకదా!

విష్ణు—[తనలో] ఇంకఁ గాలహరణం బొనరింపక నాయభిప్రాయ మెఱిఁగించెదగాక! యోషామణీ! నన్నియ్యెడకు నాకర్షించి గొని తెచ్చినది నీసౌందర్యమే కారణము,

తే. గీ. జగములందున నున్నట్టి • సతులలోన
నందమున మేటి వగుచును • నలరునట్లు
గలికి నిన్ను సృష్టించె నా • కమలభవుఁడు
భవ్యభవదీయ భాగ్యంబు • బలుకవశమె.

బృంద—(తనలో) ఈజగత్కర్త నా సౌందర్యమును గూర్చి పలుకు చుండెనేమి? (ఆలోచించుచున్నది.)

విష్ణు—

మ. అనుమానింపక తెల్పుచుంటి విను ము • ద్యద్రాజబింబాస్య; నీ
ఘనసౌందర్యమె తెచ్చె నియ్యెడకు, జి • క్కంగట్టె నన్నిప్డు, నీ
వనుమానింపక డెందమందు మదభీ • ష్టావాప్తిఁ జేకూర్చెదో
విని దోషంబిది యంచు లోఁదలఁతువో • బింబోష్ఠి యేమందువో.

తే॥ గీ॥ సకల జగములు రక్షింపఁ ♦ జాలినట్టి
నేనె నీదు రూపముగాంచి ♦ నెలత! మోహ
మంది, భవదీయ రక్షణం ♦ బందవచ్చి
నాఁడ, నెట్లాదరింతువో ♦ నాతిమిన్న.

బృంద—(తనలో) అక్కటా! సర్వ జగన్నాయకుండగున యీ భగవంతుఁడు నన్ను మోహించెనుగదా! ఇట్టి వింత యీతని విషయమున మున్నెన్నఁడైన వినియుంటినా? శ్రీమన్నారాయణుం డగు నితఁడెక్కడ? సామాన్య యువిదనగు నేనెక్కడ? నన్ను గామించుటేమి? (యించుక యూరకుండి) భగవంతుఁడగు నితఁడు మదీయ పాతివ్రత్యము పరీక్ష సేయఁదలంచి యిట్లు గోరియుండునని తలంచెదను. నేనీమహానుభావునకు నేమని ప్రత్యుత్తరమిత్తును? (ఆలోచించి) కానిమ్ము. నాభక్తిఁ జూపుచు నెమ్మదిగా నిట్లు బలికెదగాక! (ప్రకాశముగా)

సీ. శ్రీమద్వైకుంఠపు ♦ రీనిలయుండవై
ధర్మపద్ధతివీడి ♦ తనరుటేమి
అక్షీణలక్ష్మీక ♦ టాక్షదీక్షుఁడవయ్యు
నిట్టికోరిక మది ♦ నెంచుటేమి
పదునాల్గుభువనముల్ ♦ పాలించుమేటివై
యారీతిఁ బరసతి ♦ గోరుటేమి
సకలభక్తజనర ♦ క్షకుడవై, నెలతకై
మోహంబు నీభంగిఁ ♦ బొందుటేమి

తే॥ గీ॥ చిత్రముగఁదోచె నీదగు ♦ చిత్తవృత్తి
నాగుణము పరీక్షింప, మ ♦ నంబునందు
దలఁచి, యీవిధంబుననుఁ ♦ బల్కియుందు
వంతెగాని నీవేడ యి ♦ ట్లనఁగుటేడ.

భువనశాసనుఁడవైన నీవు నాచిత్తము బరీక్షింప నిట్లు గోరితి వని తలంచెదను. కాకున్నచో, నీవేడ? యిట్టిబుద్ధిని బూనుటేడ.

కృష్ణు—ఓ రమణీశిరోమణీ! నేనట్టివాడనైననేమి? నీ సౌందర్యము నాచిత్తము నాకర్షించినది.

శా. యోషా! దోషమటంచు లోదలపకే ♦ యోగీంద్రమోక్షప్రదున్
భాషేశాది సురస్తవాభరణ వి ♦ భ్రాజిష్ణునిన్ నన్ను; సం
తోషం బందగ జేయుమీ, యదియె సం ♦ తోషంబు నీకిచ్చు నీ
కీపన్నాత్రిము నిందరాదవని, లే ♦ నేనేను రక్షింపగన్.

బృందా! ఈవిషయము నీవు సందియ మందవలదు. నీయశమున కావంతయు భంగిమురాని మార్గము నేనరసెద.

బృంద—(తనలో) ఆహా! ఏమి యీవింత! ఈతఁడు నిశ్చయముగా నాపై మోహముఁనందియే యిట్లు వచ్చినాఁడు భగవంతుండగు నీతనికే యిట్టిబుద్ధిపుట్టినచో నెవ్వరుమరల్పగలరు? వినయవాక్యముల చేత నీతనిచిత్తమును ద్రిప్పివేసి యిమ్మహాత్ముని యనుగ్రహమునకు బాత్రురాలనగుటకుఁ బ్రియత్నించెద. (ప్రకాశముగా)

మ. అకటా యేమనిపల్కుచాన నిను దే ♦ వా! నన్నునింతైన నెం
చక కామించితివయ్యయో యిదిజగం ♦ బాలించినన్ సంశయిం
పక నిన్నున్ హరియే పరాంగనకునై ♦ భావంబులో నిట్లు రో
యక మోహంబును జెందెనేయనుచు నిం ♦ దాడంగనూహింప దే.

నీవు మహానుభావుడవు. సకలసృష్టిస్థితిలయంబులకును గారణుండవు.

మ. అమలమనీష నిన్ గొలుచు ♦ నమ్మహితాత్ములు పుత్రమిత్రవ
ర్గముపయి మోహముల్ విడిచి ♦ రాజిలి యోగులు నౌచునుండగా
భ్రమఁగొని నీవె యిట్లు బర ♦ భామరతంబున కాసజెందదే
సుమహితసద్గుణాభరణ ♦ చోద్యము నీచరిత్ర మెంతయున్.

ఏమహనీయుని కీర్తనోగ్రకచమున వితతారిషడ్వర్గ లతికావితానము దెగునో, ఏశుభప్రదుని చింతనార్క ప్రభలచేత సంసార

తమస్త్రాత మడంగునో, ఏ దేవ దేవుని సేవాదవానలశిఖలు విషద్రుశాటవిని దహింపఁజేయునో, ఏమహాపురుషుని భజనాంజనముచే నపవర్గ నిధిగానిపించునో, యట్టియాదినారాయణుండవగు నీవిట్టి కార్యము సేయుటకుద్యోగించిన నేనేమనఁగలదానని పుండరీకాక్షా! ఒకవేళనీవు నాచిత్తవృత్తి నరయఁదలంచి ఇట్లు బలికితివేమో! నీవావిషయమున సందియమందఁ బనిలేదు. పతిపదాంబుజసేవయు, భగవంతుండవగు త్వత్పదసేవయుఁ దప్ప, నన్యసుఖమేమియు గోరను. కావున నా యందనుగ్రహంబూని నీచిత్తమును మరల్చుకొని,నీభక్తురాలిగ నన్నును గ్రహింపుము.

విష్ణు—

మ. అతివ! సందియమంద నేమిటికి ను ♦ ద్యత్ప్రీతి విష్ణుండె యా
గతి, సామాన్య తలోదరీమణిని నో ♦ కర్తైక మదింగోరి, యం
చితమోదంబున జేరి వేడగను, వా ♦ సింబొందగా నెంచకీ
గతి వాక్రుచ్చెడి మోహనాంగికలదే ♦ కల్యాణిమొందైనసుక

శశాంకవదనా! బృందా! ఇది యధర్మకార్యంబని చిత్తంబున దలంపవలదు. మదీయాభీష్టము దీర్చుటవలన నీకుదుర్యశము గలుగునని తలంచవలదు. నాచేతఁజేయఁబడిన యెట్టి కార్యమైనను ధర్మముగనే ప్రకాశించును. ఇదియుంగాక నీవునాకోరిక దీర్చితివేని, నిన్నుఁగూర్చి మహాతపంబాచరించిన మహనీయులైన నందరాని దివ్యపదంబున నిన్నునిల్పెదను.

బృంద—

సీ. అఖిలజీవులను నీ ♦ వాడింపుచుందువు
తోలుబొమ్మలగతిఁ ♦ దోయజాక్ష
కనుకట్టు గట్టెదు ♦ గారడీమనుబోలె
మిథ్యాప్రపంచమ ♦ మేయచరిత
జక్కులవాడవై ♦ జనుల వివేకంబు
బాపుచుండెదవు దైవ ♦ వతలలామ

వేషముల్ వేతువు • బృందారకుల్ వేడ
బహువిధంబున నీవు • భవ్యతేజ
తే. గీ. మోహమూనెద వొకరిపై • మోహమంద
జేతు వింకొకరి నిట్లు • జెలగుచుందు
నీమహామహిమఁ దెలియ • నీరజాస
నాదులకునైన శక్యమా • హరిముకుంద.

దేవా! నీయభీష్ట మధర్మమైనదని చెప్ప సాహసించినందులకు నన్ను మన్నింపుము నేను పరమసాధ్విని. పతిపదాంబుజ సేవయే సతికి భూషణమని యెఱింగినదానను. ఒకరిని సంతోషింపఁ జేయుటకుఁగాని లేక స్వార్థము నపేక్షించిగాని నేను సాధ్వినై యుండు దానను గాను. పతిసేవ సతికి దైవచింతనకంటె నెక్కుడు మహిమగలదని నేను గుర్తెఱింగితిని. అట్టిచో నేనధర్మకార్యమాచరించితినేని నాయాత్మ తిరుగ విముక్తి బొందుటకసాధ్యమగునంతటి ఘోరనరకమునఁబడ గలదు. నాసాధ్వీత్వముచే నిదివఱ కార్జించిన యశముమున్ను గలిగియును సతికి బతివ్రతత్వమే సర్వసంపదల నొసంగును. అదియే సర్వాభీష్ట ఫలప్రదము. అదిగే సకలాఘ విమోచనము. అదియే సజ్జన స్తవనీయము. అదియే సంతోషకారణము! వేయేల? అదియే మోక్షసామ్రాజ్యసౌధారోహణమునకు సోపానము. కావున నామనం బట్టి యధర్మోద్యోగమునఁ బ్రవేశపెట్టి లోకులు నన్ను నీచముగ జూచునట్లు చేయకుము. భగవంతా నీపాదకమలములకు నమస్కరించుచున్నాను. నాయందుఁ గృపాంతరంగుఁడవై నీబుద్ధినిమరల్చుకొని, బృంద మహాసాధ్వియను యశోడిండిమము జగమున మ్రోగజేయుము.

విష్ణు — (తనలో) ఆహా! అమృతోపమానములగు నీమెవాక్యములు నాకెంతయు మోదము గొలుపుచున్నవి కదా. సంపూర్తిగ నీమెచిత్తమును శోధించినఁగాని విడువరాదు, (ప్రకాశముగా) బృందా!

నారాయణుండనగు నేనునిన్ను జేరియుట్లువేడ, వలదని నిరాకరించుట నీకు ధర్మమా?

మ. తరుణీ యేమి వచింతు నీకిప్పుడు సం • తాపంబునుంగూర్చి యా
స్మరుఁ డుగ్రుండయి వేడి తూపులచేతం • పంచచ్ఛితాస్త్రాళిఁ జె
చ్చెర బాధింపఁగ నిల్లు వచ్చితిని రా • జీవాక్షి నీ వ్వేడఁగాఁ
గరుణన్ జూడుము నన్ను, నీకును యశః • కల్యాణముల్ జేకురున్.

బృంద—మాధవా! నాహృదయము నీకు విశదపఱచితిని. ఇంకను నీయనవసర ప్రసంగముతో నేమిపని యున్నది? చతుర్దశభువన నాయకుండనగు నీకుఁగూడ మదనావస్థయేనా? మదనుండు నీతనయుఁడే కదా!

విష్ణు—బృందా! మన్మథుండు తనయుండైననేమి? వాడు తన వారిని పెరవారిని నొక్కరీతిగనే చూచును. నీవిషయమున నాతఁడు నన్నుఁ దండ్రి నగుదుననియైన భావింపక బాధించుచున్నాఁడు. ఒక్క మదనుండే కాదు. నాకుటుంబమున నున్న వారందఱును నాకు విచారమును గూర్చువారే!

సీ. నాజ్యేష్ఠపుత్రుండు • నలు మొగంబుల వేల్పు
శాశ్వత కార్యముల్ • సలుపుచుండు
రెండవ పట్టిమా • రుండు స్త్రీ పురుషుల
మోహ సాగరమున • ముంచుచుండు
నిందిరాదేవి నా • యిల్లాలు నిరతంబు
జంచలవృత్తి జ • రించుచుండు
భూమిదేవి ద్వితీయ • పూబోఁడి, యెప్పుడు
నిలచినచోటనే • నిలచియుండు
తే. గీ. వసతి రత్నాకరంబు, మేల్ • పాన్పు పాము
వాహనము పన్నగవిరోధి • భళిర నాదు
చిత్రసంసార కష్టంబుఁ • జెప్పవశమె
తెలియకున్నదె నాకథ • కలికి మున్న.

బృంద—దేవా! ప్రస్తుత విషయమును గూర్చిన సంగతి కా ంచఁగాసి, చెప్పుచుంటిని.

సీ. అవనిదేవివిమె నీకు ♦ సకల ధారకుఁడన్న
విమలయశంబును ♦ గొలుపఁగలిగె
అల రమాదేవి నీ ♦ యాలియై భక్తమం
దారుఁడనెడి బిరు ♦ దంబు గూర్చె
భారతీరమణుండు ♦ పట్టియై గొప్ప సం
సారి యనంబడఁ ♦ బేరుదెచ్చె
పరమపావని దివ్య ♦ వాహిని పుత్రియై
కలుషనాశనుఁడన్న ♦ ఘనతఁ గొలిపె
తే. గీ. నిజము దలపోసి చూడంగ ♦ నీకు నీదు
పరిజనము దెచ్చు ఖ్యాతియే ♦ ధరణినిండె
నీవు దామోదరుండవు ♦ నిశ్చయముగ
తెలియదా నీదు చరితంబు ♦ జలరుహాక్ష.

పంకజనాభ! మహామహులకైనను దుర్లభంబైన నీ దివ్యమంగళవిగ్రహ సందర్శనము నాపురాకృత భాగ్యంబున లభించినది. నేను విగతకల్మషనైతిని. నీవు నాచిత్తమారయుటకో, లేక యుద్దేశపూర్వకముగనో, తెలిపిన నీయభీష్టమును మనంబునుండి బారదోలి, దాసురాల నగు నాగృహంబునకు నే డతిథివిగమ్ము. నాశక్తికొలఁది బూజించి కృతార్థురాల నగుదును.

విష్ణు—(తనలో) ఈరమణీమణి యెన్నివాక్యములయిన బలుకుచున్నది గాని, నాయభీష్టమునకు మాత్రము సమ్మతింపకున్నది. ఈమె హృదయము నిష్కళంకమైనది. ఈమెకు నాయందున్న భక్తి వర్ణనాతీతము. (ప్రకాశముగా) తరుణీ! నేనడిగిన దొకటియు నీవు చెప్పున దొకటియుగ నున్నది. నాకేమి సరియైన ప్రత్యుత్తరమిచ్చెదవు? కాలహరణమునకు నా చిత్తమొకింతయుఁ దాళదు.

మ. సరసీజాక్షిరో నాకు నీ విపుడు పూ ♦ జల్ సేతు నన్నందుకే
బరమామోదముగల్గె; గాని వినుమా ♦ భావోద్భవుండేయు తీ
కర బాణంబులకోర్వలేక నినుఁగాం ♦ చుం జేరి యాచించు శ్రీ
హరినిన్ నన్ను నలంతిగాఁ దలచి యి ♦ ట్లాడంగ నీకర్హమే.

బృందా! నీవు నన్నుఁ గరుణింప వేని విరహాగ్నింబడి మ్రగ్గుట నిశ్చయము. నేనిట్లయితినేని, సర్వజగత్క్షోభముగూడ తటస్థించును. ఇందులకుఁ గారణము నీవేయగుదువు, కావున నన్ను గటాక్షించి కృతార్థురాల వగుము. నాకుఁ బ్రీతిసేయుట సర్వజనంబునకును బ్రీతిసేయుట యగును.

బృందా—ముకుందా! నీవెంత చెప్పినను నాచిత్తమధర్మోద్యోగమునఁ బ్రవేశింపదు. భువనశాసనుఁడవయిన నీవిట్టి దుష్కార్యము సేయదలంచుట యధర్మమగును.

సీ. అఖిల జగంబుల ♦ నజునిచే సృష్టింప,
నొసరించు మహిమ యే ♦ యూరు జేరె
భూరి చతుర్దశ ♦ భువన శాసనమహో,
దక్షత యేమూల ♦ దాగియుండె
అశ్రాంత పరమ భ ♦ క్తౌఘసంరక్షణ,
బిరుద మేమహానీయు ♦ దరికిఁ జేరె
అమల భక్తముని గ ♦ ణామర పూజితో,
దార పరిభావ మెం ♦ దడఁగియుండె

తే. గీ. ఆదినారాయణాఖ్య మెం ♦ దలరియుండె
విశ్వ సన్నుత గుణమెట ♦ వెలుగుచుండె
వీనినెల్ల మఱచి యవి ♦ వేకి కరణి
సాధ్వినగు నన్ను గోరుదే ♦ జలజనాభ.

ముకుందా! మహోన్నతపదవి నధిష్ఠించియుండిన వాఁడవగుటం జేసి నిన్ను జగములెల్ల భగవంతునిగాఁ గొల్చుచున్నవి. నేనును నీ యందు నిర్మలమైన భక్తిఁబూని చరించుచున్నదాననే. ఇట్టి యధర్మ

కార్యమునందు నీవు ప్రవేశించితి వేని, నీ మహోన్నత పదవునకు భంగము గలుగును. భక్తరక్షణ కార్యము మఱచి, యిట్టి యధర్మ వర్తనో ద్యోగమునఁ బ్రవేశింపఁ దలంచిన నీతో నీ విషయమగు ప్రశంస సేయఁజాలను గావున నేను గృహంబున కరిగెదను. దేవా! నే నిట్లు బలికితినని యాగ్రహింపకుము. నీదివ్య నామస్మరణ మాత్రము నాచిత్త మెప్పుడును విడఁబాయదు (పోఁబోవును)

విష్ణు—(తనలో) ఆహా! ఈమె నిశ్చలహృదయ మెంతయు నుతి కర్హమైయున్నది (ప్రకాశముగా) బృందా! బృందా! నీవునన్ను మోహసాగరమున ముంచి యరిగెదవా?

చ. అరుగఁగ నెంచెదే జలజ ♦ హస్త్రిరొ నన్నిటు ఘోరమోహసా
గరమున ముంచివేసి త్రిజ ♦ గంబుల గొల్చుచు నేను నిన్ను నీ
కరణిని వేఁడుచుండఁ గిన ♦ గా మదినెంచక యింతగా, నిరా
దరణవహించితే? భగవ ♦ దార్చన యిట్టిదె? భక్తురాలికిన్.

కుందరదనా! నేను నిర్గుణుండనయ్యు, గుణము గలిగిన వాడ ప్రకాశించుచుందును. నిర్మోహమున నుండినను సమస్త జగంబుల మోహింపఁ జేయుచుందును. రమణీ! నీచే నిరాకరింపఁబడి నేనెట్లు మరలిపోవుదును? శ్రీహరి నగు నేను నీవిషయమున మనోరథ సిద్ధిఁ బొందక పోయినచో నాప్రభావమే ముండును?

బృంద—ఏమీ మాధవా! భగవంతుండవగు నీవు నీమహిమ పరదారల గూడు నిమిత్తమే వినియోగపఱుపఁ దలంచితివా? అక్కటా! ఎంతసాహసము నీ హృదయము జగంబెఱుంగ లేకపోనుగదా.

సీ. తనుఁ గంటె నిన్నె యు ♦ త్తముఁడని కాదె సు
రులు దైవముగ నిల్పఁ ♦ గలిగినారు
సర్వేశుఁడనిగాదె ♦ సకల భక్తసమితి
భూరి భక్తిని నిన్ను ♦ బొగడినారు

ఘనమైన పదవిని • గనికాదె తాపస
శ్రేష్ఠులు నిర్జరా • జేసినారు
అవ్యయుండని కాదె • యఖిల సవన కార్య
ములయందు భోక్తగా • నిలిపినారు
తే. గీ. వీనిచే గాదె త్రిభువన • విభుఁడవనఁగ
దుర్లభపదంబు చేతికి • దొరికెనీకుఁ
గాన నిలుపుకొనంగాను • గారవంబు
నిట్టిదుష్కార్యముల పొంత • కేగుదేని
నిజపదచ్యుతిఁ బొందెదు • నీరజాక్ష.

ఈవిధమున భాషించు నీయెదుట నేనింక నిలువనోప.

(నిష్క్రమించును.)

కృష్ణు—బృందా! బృందా! అనుగుచుంటివా? భగవంతుఁడ నగునామాట నింత నిరాదరణమా! (తనలో) ఈమెపాతివ్రత్యము లస్వతీయములై యున్నవి. నెమ్మదిగా నీవిషయమై యోచించెదఁగాక. (నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





# సతీతులసి.

## తృతీయాంకము



రంగము!—[గాలవాశ్రమము ముందు జలంధరుఁడు—ప్రవేశము.]

జల—(తనలో) గాలవుని సతియగు చారుమతి సౌందర్యవతు లందెన్నికఁగన్న కాంతయని వినియుంటినేగాని, యెన్నఁడును వీక్షించి యుండలేదు. ఇప్పుడు నే నెట్లయిన నీ ముని యాశ్రమంబును బ్రవేశించి యా కాంత నరయవలయును, నా యుద్యమమున కనుకూలముగ గాలవుఁడాశ్రమమున లేకయున్నచో, నా భాగ్యము పండినట్లే. (ఎదుటఁజూచి) ఎవ్వరో సుదతీమణి యిట్లు వచ్చుచున్నది. యెవ్వరైయుండును? చారుమతియే యై యుండునా? (పరికించి) నా యనుచరులు చెప్పిన మాటలఁబట్టి జూడఁగా నీమెయే చారుమతి యగునని తోఁచుచున్నది.

(తెరలో)

అమ్మా! చారుమతీ! భగవదారాధనకుఁ బుష్పములఁ దెచ్చుటకు నీవుగూడ వచ్చెదవా? (ఇంచుక యూరకుండి) ఏమనుచున్నావు? నీ నాథుఁడాశ్రమమున లేఁడు గావున నీవు పోయిరమ్మనియా? సరే! నేను పోయివచ్చెదను.

జలం——(విని తనలో) ఆమెయే చారుమతి. ఆమె వాక్యములం బట్టి చూడఁగా గాలవుఁడాశ్రమమున లేడని తోఁచుచున్నది. నాయుద్యమమునకీ సమయ మెంతయు దగియున్నది. భూపాలుఁడనగు నే నాశ్రమమునఁ బ్రవేశించుట కేవిధమయిన యభ్యంతరమును నుండదుకదా ? (పరికించి) ఈమెసౌందర్య మద్వితీయమైయున్నది. మునిపత్నుల కిట్టి సౌందర్యముండునాయని సంశయించితిని. గాని యీమెను జూడఁగానే యా సందేహము వాసినది.

శా. ఔరా కన్నులతీరు, చక్కఁదనమా ♦ హా! మోముచందంబు న
య్యారే! నీలములన్ హసించు కురులౌ ♦ రౌరా, మిటారంబు, మ
ఝ్ఝారే! చన్గవయద్దిరా! తను విలా ♦ సస్ఫూర్తి వహ్వారె; యీ
నారీరత్నము బోలు సుందరిని గా ♦ నన్ జాల లోకంబులన్.

తే. గీ. కొమ్మ గాదది ముద్దుల ♦ గుమ్మగాని
కలికిగాదది మదనుచే ♦ చిలుకగాని
కాంతగాదది రతనాల ♦ బంతిగాని
భామగాదది సౌందర్య ♦ సీమగాని.

ఈ తరుణీ శిరోమణి వాలుచూపులఁ జూచెనేని, మదనుండే తన విలునమ్ములు నేలఁబడవైచి యీమెకు దాసుఁడు గాక యుండునా? ఈతలోదరిని వీక్షించినంతనే, యీ యనంగుఁడు తన పుష్పశరంబుల నాపై బఱపసాగినాఁడు. కానిమ్ము నే నీ యబ్జాక్షిం జేరి మదీయ మనోరథం బెఱింగించి కృతార్థుఁడనై యీ కాముని గర్వమడంచెదఁగాక! (ఇంచుక నడచిచూచి) అదిగో! ఆమె బిందెగైకొని జలార్థమై కాబోలు నదకరుగఁ దలంచుచున్నది. భళిరా! ఈమె సౌందర్య మిప్పుడు సంపూర్తిగ గానిపించుచున్నది.

ఉ. కన్నులు కర్వుదీర సిత ♦ కంజదళంబుల మంజువై ఖరిన్
గన్నులు; చంద్రసారము ము ♦ ఖంబున, బింబము పంబు వాతెఱన్
బన్నగరీతి కీల్జడను ♦ పల్లులసారు శరీరశోభలన్
గ్రొన్నగుత్తులన్వొలకుఁ ♦ గొన్నవిలాసము చేత చన్గవన్.

దిన్నని దివ్యచంపకము • తీరు కొమరగు నాసికంబు నం
దెన్నఁగరాని సొంపుఁదుల • కింపుఁబరాఁగముఁన్ వహించి, రా
జన్నగధాళధళ్యమును • సన్న మొనర్చుచు విన్వగుచ్ఛెళుల్
బన్నినపావడంజిలుఁగుఁ • బయ్యెద గుత్త పుష్పైకకప్పలం
టన్నెరయించి, మధ్యనిక • టంబునఁగొంచి ధరించి, మంచిరా
కన్నెలఁదీవిమించి, కర • కంకణముల్ పచరించి, భద్రముల్
చెన్నడఁగింకిణీరవవి • నిర్మల శైలినతిక్రమించి, చం
చన్నితరావలోకన ర • సభ్రమచే హరిణిన్వసించి, యు
య్యన్నలమిన్న బిందెగొని • యూనదికేగెదు నీరుదేరఁగన్.

(పరీక్షించి) లేదు. లేదు. మరల నేకారణముచేతనో బిందె నక్కడబెట్టి యీమె యిక్కడవచ్చుచున్నది నేను నెమ్మదిగా నీమెకంటఁ బడెదఁగాక (ఇంచుక ముందునకుఁ బోవును)

[ చారుమతి - ప్రవేశించును ]

చారు—(తనలో) పుష్పములకొఱకరిగినమైత్రేయి యింక నురాలేదేమికారణమో!

(జలంధరుఁడు - చారుమతి చూచునట్లు ముందుకు వచ్చును.)

చారు—(జలంధరునిఁజూచి యించుక వెనుకకేగి తనలో) ఓ హో! ఈతఁడు జలంధరుఁడు. ఇప్పుడీతడియ్యెడ కరుదెంచుట కేమి కారణమోకదా!

జలం—[చారుమతిని సమీపించగ నామె వెనుక కేగుటఁజూచి] తాపసపత్నీ! నన్నుఁజూచిననీవు భయమందెదవేల? నేను పెర వాడనుగాను జలంధరుఁడ. మునీంద్రుఁడాశ్రమమున నున్నవాడే?

చారు—(తనలో) మునిపత్నినగు నేనీతనితో మాటలాడినందు వలన నేమిదోషము సంభవించు; (ప్రకాశముగా) నృపాలా! వారాశ్రి

మమునలేరు. సమిత్కుశ ఫలహారార్థమై యరిగినారు. ఇప్పుడే యరుదెంచి భూపాలుండవగు నిన్నుఁ దగిన విధంబున గౌరవింతురు. అంతవరకును నాశ్రమమున విశ్రమించియుండుము.

జల—(తనలో) ఆహా! ఈయువతీమణి మృదుమధురభాషణములు నాకెంతయు సంతసము గొలుపుచున్నవి. నేను నిస్సారదిగా నాయభిప్రాయ మెఱింగించితినేని, యీమె తప్పక సమ్మతించుననియే తోచుచున్నది. (ప్రకాశముగా) యోషామణీ! నీయాదరంబునకు నేనెంతయు సంతసించితిని. కాని యొకవిషయమున మాత్రము నిన్నుఁ జూచిన నాకుమిగుల విచారము గలుగుచున్నది.

చారు—రాజేంద్రా! నీవునన్నుఁజూచి విచారింపవలదు. ఒకవేళ మేము తాపసులముగదా నిన్నుఁ బూజింపలేమని నీవనుమాన మొందఁబనిలేదు. తపోగరిష్ఠుఁడగు మన్నాథుఁ డేతెంచి, భవత్పరివారంబునకును, నీకును గూడ విందు లిడఁగలఁడు.

జలం—

ఉ॥ విందులొసంగనేల, యర • విందదళేక్షణ నాకు మీర లా
నందము మీఱ నిప్పుడు మ • నంబున సంశయమెల్ల వీడి నే
నిం దరుదెంచు కారణము • నింపుగ జెప్పెదనీకు, దాని, నీ
వుందగ నాలకించి కృప • బ్రోచెదవో మఱిబ్రోవకుందువో.

మ. సురనారీమణులన్ భుజంగసతులన్ • క్షోణీశశుద్ధాంత సుం
దరులన్ గారుడవంశకన్యకల, గం • ధర్వాంగన శ్రేష్ఠులన్
జిర మోదంబున గంటిగాని, వినుమీ • క్షింపంగలేదెందు, నీ
సరియౌకాంతను, నిశ్చయంబిదిసుమా • శీతాంశు బింబాననా.

చారు—(తనలో) ఈతఁడవసరములేని ప్రసంగములోనికి దిగుచున్నాఁడు. ఈతని గుణములను గూర్చి మున్నొకసారి నేను వినియున్నాను. అయినను భూపాలుఁడుగదా? ఆశ్రమమునకు వచ్చినప్పుడు గౌరవించకపోవుట యుక్తముగాదని భావించితిని.

జలం—రమణీ! శిరోమణీ! త్రిజగంబులను సమ్మోహసాగరంబున ముంచఁజాలిన సౌందర్యముగల నీవొక బడుగు దానవునిని గైకొని కష్టములనుభవించు చుంటివిక దా! నీసౌందర్యమును గూర్చి నాచారులవలన నింతకు మున్న నేకసారులు వినియుండి, యెప్పుడేని నిన్నొంటిగఁజూచి సంభాషించు భాగ్యముగలుగ కుండునా యని వేచియుంటిని. అయ్యది నేటికి లభించినది. ఆలస్యము చేసినచో మోసమగును. గావున నొక్క మాటలోఁ జెప్పెదను.

మ. వనజాక్షీ నినుఁ జూడగానె వినుమా ♦ పంతంబురుల్ బూని, చం
డనిశాతాస్త్ర పరంపరల్ దనువు నిం ♦ డన్ జాలగీలించి నె
ట్టన హంసాది ఖగార్భటుల్ జొనిపి వే ♦ డ్కల్ మన్మథుండుండె; నీ
వనుమానింపక నన్ను నేలుకొని భా ♦ గ్యశ్రీలతోఁ దూగుమా.

రమ్ము. నీభర్తరాకమునుపే నాపురంబునకుఁ బోవుదము.

చారు—(తనలో) అక్కటా! ఈనృపాలునకు నన్నుఁ జూడగనే యెట్టిదుర్బుద్ధి పుట్టినది. ఇప్పుడు నేనేమి సేయుదును? మునికన్యకలు కాని, నాథుఁడుగాని యాశ్రమమున లేరు. కానిమ్ము—నేనీతనికి సామవాక్యములఁ బలికి హృదయమును నా దురుద్యోగమునుండి మరలించెదఁగాక! ఈలోపుగా తాపసకన్యలు గాని నాథుఁడుగాని రాకయుండునా? (ప్రకాశముగా) రాజేంద్రా! నీవు నృపాలుండ వనుటచే గౌరవించక పోవుట యుక్తముగాదని తలంచి సంభాషించి నందుకు మాకుఁ గలుగు ఫలమిదియా?

ఉ. వాలన శీలముల్ విమల ♦ భావము కన్పడ భూతలంబునుం
బాలనసేయు భూతలుల ♦ భంగులెఱింగియు నిట్టిరీతి దు
శ్శీలుఁడవై పరాంగనలఁ ♦ జేరగనెంతువె ధర్మమౌనె, లో
కాళి హసింపదే నిను ధ ♦ రాధిప! బుద్ధి మరల్పుమీ వెసన్.

జలం—అన్నులమిన్నా! ప్రపంచమున నేనొకరిని ప్రాధేయపెట్టువాడనుగాను. నాచిత్తము నీయందుఁజిక్కినది. నాయభీష్టమునీ కెఱింగిం

చితినేని నీవు తప్పక యంగీకరింతువని తలంచివచ్చితిని. (ఎదుటం జూపుచు)

తే. గీ. అదిగో పరివారముస్నది • యచట; రథము
నదిగో యెక్కుమా యిక సంశ • యంబు విడిచి
మత్పురంబును జేరు; • నా మగువ వగుచు
సౌఖ్యములం బొందెదవుగాక • జలజనయన.

చారు—(తనలో) ఆశ్రమమున నానాథుండు లేని సంగతి నెఱింగియే యీతండు నాయెడల ద్రోహబుద్ధిని బూనివచ్చినాడు హా! పరమేశ్వరా! నన్నీ దురాత్ముని బారినుండి రక్షింపుము (ఇంచుక యూరకుండి) దుష్టచిత్తుండగు నీతండు నేనేమి చెప్పినను వినండు. వీనితోం గొంత వఱకుం గాల యాపనము సేయుచుంటినేని యింతలో నా చెలికత్తెగాని నాథుండుగాని వచ్చును. (ప్రకాశముగా) జలంధరా! నీ వీశ్వరుని నయనంబుల నుండి వెలువడిన కోపజ్వాల వలన జనించితివి. నీకుం దెలియని పరమధర్మము లెందును లేవు.

మ. చతురంబోధి పరీతభూపలయ రా • జన్యాన్వయోత్తంస సం
తతి సేవింపంగం జక్రవర్తివయి వ • న్యాగ్రాసదీక్షా కృశీ
కృతగాత్రిన్ మునిపత్నినీగతి ధృతి • శ్రీహీన చిత్తుండవై
పతిగాంగమ్మని కోరుచుంటివకటా • శ్లాఘింతురే విజ్ఞ జనుల్.

మ. క్షితిలో లేరె సతీమణుల్ నవవయ • శ్శ్రీరూపలావణ్య జృం
భిత లో భూవర, నీకుం గోరంగందలం • పేయున్న; నీవట్టిచో
వ్రతనై నారలు గట్టి తాపసకుటీ • రక్షోణియందిట్లు సం
తతమున్ భర్తనుగొల్చుచున్ దనరునన్ • గామించుటల్ ధర్మమే.

జలం—రమణీ! కాముకులకు యుక్తాయుక్త విచారణముండదు. (ఇంచుక యూరకుండి) ఇంక నేను కాలహరణమునకు దాళంజాలను (సమీపించుచునాండు.)

చారు—(తనలో) ఈతఁడంతకంతకు మీఁదకు వచ్చుచున్నాడు. ఇచ్చట వీనిదుష్కృత్యమును నారించువారెవ్వరునులేరు. (ప్రకాశముగా) భూపాలా! ఇదినీకు ధర్మముగాదు. నేను తాపసపత్నిని. సాధ్విని. పరాంగనారతము పాపమని యెఱింగియు నిట్టి దురుద్యోగమునఁ బ్రవేశించుట నీకీర్తికినిఁ బ్రాణములకుఁగూడ హానిసంభవించును. నామాటవిని నన్ను నీసోదరిగ భావించి వచ్చిన దారినిఁ బొమ్ము. ఇట్టిదుర్వృత్తిం బ్రవేశించి, సాధ్వీముఖుల నోటినుండి వెలువడు శాపాక్షర మహాగ్ని జ్వాలల కాహుతుఁడవు గాకుము.

జలం—తరుణీ! నన్నిరీతి భయపెట్టఁ జూడకుము. కామించి వచ్చిన నన్ను నీయంతట నీవాదరింతువేమో యని యింతవఱకునీ గాలహరణమున నోర్చితిని. ఇంక నేనోర్వజాల నేనేనిన్ను బలవంతముగరథముపైఁ బెట్టుకొని కొనిపోయెద- (పట్టుకొనఁ బోవును.)

చారు—(కోపముతో) ఔరా! ఏమి! నీసాహసము, తాపసపత్నినగు నన్ను బలవంతముగ, గొనిపోయెదవుగా! నీకు వినాశకాలముసమీపించినది. (నాథుని నుద్దేశించి) హా! నాథా! దుశ్శీలుఁడగు జలంధరుఁడు బలవంతమున నన్నుఁ గొనిపోవ తలంచుచున్నాడు. సత్వరముగవచ్చి నన్నురక్షింపుము. హా! మైత్రేయీ! ఈ సమయమున నీవైననున్నచో నీదురాత్ముఁడిచ్చటకు రాకయుండునుగదా!

[ తెరలో ]

ఎవ్వఁడాదురాత్ముఁడు! ఇదిగో వచ్చుచున్నాను.

జలం—(ఎదుటఁజూచి) అక్కటా! కార్యమునకు భంగమైనది అదిగో! గాలవుఁడే వచ్చుచున్నాఁడు. ఇంకనేనిచ్చట నిలచియుండరాదు. మఱియొక సమయమున నీమెనెట్లయినఁ గొనిపోయెదగాక.

(తొందరగాఁ బోవును)

చారు—(తనలో) అబ్బా! గండము గడచినది. ఈనీచాత్ముఁడు నాథుఁడు వచ్చుచుండుటఁ జూచి యీప్రదేశము విడిచినాడు. లేనిచో నాకెటిహాని సంభవించి యుండునోకదా!

గాలవుఁడు—(ప్రవేశించి) ఎవ్వఁడా దురాత్ముఁడు!

చారు—నాథా! వచ్చితివా! ఈసమయమున నీవు రానియెడల నేనెట్టియాపదను బొందియుందునో కదా!

గాల—అదియేమి?

చారు—జలంధరుఁడు...

గాల—ఆదురాత్ముఁడు నేడు మన యాశ్రమమునకు వచ్చెనా? యేమి! పరనారీ హరణవ్యసనుఁడగు నాతఁడు నిన్నేమియుఁ జేసియుండలేదు కదా!

చారు—నీరాక యీహానిని దప్పించినది. అతఁడాశ్రమమునకు వచ్చి యనినమాటలన్నియు సావకాశముగఁ జెప్పెదను.

గాల—వానికి వినాశకాలము సమీపించినది. రమ్ము.

(నిష్క్రమింతురు)

రంగము:—(౨):-[జలంధరుని మందిరము:-ప్రవేశము జలంధరుఁడు]

జలం—(తనలో)

మ. అకటా! యేమియొనర్చువాఁడ నిపుడా ◆ యుగ్రతపశ్శ్రీ చే
తికిఁ జేకూరియుఁ దప్పిపోవుటను రా ◆ జీవాక్షి పుత్రుండు, మా
మకశౌర్యం బెడలింపనాగను నికం ◆ బద్మాక్షి నెబ్భంగిఁ జే
తికి లభ్యంబగు నట్లుజేసి మదనో ◆ ద్రేకంబు వారించెదన్.

ఆనాఁడు గాలవుఁ డాసమయమునకు రాకయున్నచోఁ జారుమతిని నాగృహమునకుఁ జేర్చియే యుందును. (ఇంచుక యూరకుండి) మించిన దానికిప్పుడు యోచించి నందువలనఁ బ్రయోజనమేమియున్నది? ఎట్లయినను సమయము వేచియుండి, చారుమతిని బంధించుకొని రమ్మని భటుల కాజ్ఞాపించితిని గదా!

[బృంద - ప్రవేశించును.]

బృంద--(జలంధరుని సమీపించి) ప్రాణేశ్వరా ! నేడింతదీర్ఘాలోచన తత్పరుఁడవై యుంటివేమి? కారణ మెఱుంగఁదగుదునా?

జలం—ప్రతివిషయము నందును జోక్యము కలిగించుకొనవలదని యెన్నిసారులు చెప్పిన నీవేల వినవు?

బృంద—నాథా! ఆగ్రహింపవలదు. రాజకార్య వ్యవహారమైనచో నేనాతెరవునకు రాను-కాని, నీచిత్తమితరాలోచనయందు మగ్నమై యున్నదని తెలియుచున్నది.

జలం—మనస్సులోపల యూహాఁగూడఁ గనిపెట్టఁ దగినంత సమర్థురాలవు.

బృంద—నీవింత పరనారీహరణంబును గూర్చి కాకున్నచో నాకు బెంగయుండదు.

జలం—అదియైన మాత్రము నీకేల బెంగ?

బృంద—పరనారీహరణము పాపమునకు మూలమని.

జలం—నీకుఁ దెలిసిన మాత్రము ధర్మములు నాకుఁ దెలియవా?

బృంద—ఆర్యపుత్రా! నేనట్లుఁ జెప్పుటకు సాహసింపఁగలనా సర్వమెఱింగి యుండియు నేకారణముచేతనో నాకుఁ జింతఁ గూర్చుచుంటివి.

జలం—నేనేమి నీకుఁ జింతఁ గూర్చితిని?

బృంద—

సీ. మనసార నీపాద • ఘనసేవఁ గొమ్మంచు,
నెన్నడైనను నాకు • నిచ్చినావె
ముదమూర నెప్పుడైన • మృదుమధురవచో
సరణినాకును జూపఁ • జాలినావె

నీవె దైవంబుగా ♦ నెంచియుండిన నాకుఁ
ప్రేమ యొక్కింత ♦ చూపించినావె
యగ్నిసాక్షిగఁ గొన్న ♦ యతివ యంచును నన్ను
గాసంత కరుణతోఁ ♦ గాంచినావె

తే. గీ. యకట! నీకు నర్థాంగినై ♦ యగునాకు
తాపము నగూర్ప నీకును ♦ ధర్మమగునె
నీకు దెలియని ధర్మంబు ♦ లోకమందు
గలదె నీకు నే వచియింపఁ ♦ గలనె నాథ.

జలం—ఇష్టము లేని వివాహము సౌఖ్యమున కాకరము కాదని నేను తొలుతనే తలంచితిని.

తే. గీ. అల స్వయంవర సమయంబు ♦ నందు సతిన
నా గళంబున హారముఁ ♦ బైవఁబోయి
క్రిందఁబడ వేసినప్పుడే ♦ కుందరదన
భూరివైరాగ్య మొందితిఁ ♦ బూర్ణముగను.

బృంద—నావలన గలిగిన యీ నేరమునకా నీవిల్లు నన్ను నిరాదరించుట!

జలం—రమణీ! అప్పుడు నేను వివాహ మక్కఱ లేదనియే పలికితిని కాని, యీనారదుఁడు బలవంతపఱచుటచేత నిన్ను మెడకుఁ గట్టుకొంటిని.

తే. గీ. గంగిరెద్దుకు మెడలోన ♦ గంతయట్లు
గట్టుకొంటిని నిను నేను ♦ కాంతమిన్న
యిప్పుడేమి చింతించిన ♦ నేమిఫలము
ననుభవింపంగ వలయును ♦ సజనివార్త్రిలు.

బృంద—ప్రాణేశ్వరా! నామూలమున నీకు గలిగిన విచార మేమియున్నది? పరదారాగమనంబు వలదనియు, తాపసుల బాధించుట తగదనియు, జెప్పుటయే కదా నావలన దోషము! నీశ్రేయమును నేను గాక మరెవ్వరు గోరుదురు?

సీ. పరసతీమణులపై ♦ భ్రాంతిని వీడుమూ,
యంచు వచించ నా ♦ లించినావె
మునిపుంగవుల నేచఁ ♦ బోవలదంచును,
జెప్పుమాటను జెవిఁ ♦ జేర్చినావు
అమరసంతతిగాంచి ♦ హాసియింప దగదంను,
నెంతచెప్పిన గుర్వు ♦ నెఱిఁగినావె
"ధర్మమే జయ"మను ♦ తాత్పర్యమును బూను,
మనిచెప్పినానుడి ♦ నరసినావె
తే. గీ. యిట్టివన్నియు వచియించి ♦ యెవగకతన
నీకునాపైనసూయ జ ♦ నించెఁగాదె
గాకయుండిన నాయందు ♦ గలిగినట్టి
దోషమేమి నీకును దోచ ♦ దో! దినేశ.

మనోహరా! ఎంతభాగ్యముండిననేమి! ఎట్టి భోగములుండిననేమి? ఘోర విపదాంబుధిఁ దరించుటకు నావయు, సంతాపదావాగ్నికి ఘనవృష్టియు, పాపారణ్యమునకు నాలవిత్రంబును, మోక్షసంధాన కర్తయునగు పతిసేవకు దూరమైన సతిబ్రదుకేల?

[తెరలో]

ఈదురాత్ముల బారినుండి నన్నురక్షింపఁ పుణ్యాత్ములులేరా!

బృంద—(ఆలించి) స్త్రీయార్తరవము వలెనున్నదే!

చారు—(జలంధరునుద్దేశించి) హా! నరపాలా! ఎంతదుష్కార్యము జేయించితివి? ఇట్టిదుష్కార్యమునందు వర్తింపనున్న నిన్నుఁ గాలుడింకను గొనిపోక యుండెనేమి పతివ్రతా శిరోమణులఁ నీవిధంబున జేయుటకేనా నీవుజన్మించినది?

బృంద—[తనలో] పాపము ఈమెయెవరో సాధ్వి. నాథుని దురంత కృత్యములకు మేరలేకుండెనుగదా! [ప్రకాశముగ] ప్రాణేశ్వరా ఈమెయెవరు?

జలం—ఎవరా! అన్ని విషయములు నీకే కావలయును. గాల వునిభార్య.

బృంద—అక్కటా! ఎంత ఘోరము ఎంత ఘోరము! తాపసి పత్నియగునీమె యెడల నిట్టి కృత్యముసేయ సాహసించుట ధర్మమా?

చారు—(బృందనుజూచి) అమ్మా! బృందా! నీవును నాడ దానవుగదా నీభర్త మొన్న మాయాశ్రమమునకువచ్చి నన్నెన్నో మాటలాడి తుదకీరోజున నిట్లుజేయించినాడు. ఈతఁడెవ్వఁడో సాధ్వీమ ణుల శాపముచేతనే యంతమందును.

బృంద—(జలంధరునిజూచి)

చ. పరసతులెల్ల దల్లులని • భావములోఁ దలపోతమాని, యా
పరమ పతివ్రతామణి, న • పారగుణాకర నిట్టి భంగినిన్
బరిభవమున్ బొనర్చుటది • భావ్యమె, శ్రేయమె, చాలునింక నీ
తరుణిని దల్లిగాఁగనుచుఁ • దాపసి సన్నిధిఁజేర్పఁగాదగున్.

ఇట్టి కార్యములే, గౌరవనాశనమునకును, ప్రాణహానికిని గార ణములగును.

చారు—(బృందనుజూచి) తల్లీ! అట్లుజెప్పి నన్నురక్షింపుము.

జలం—(బృందనుజూచి)

మ. అలినీలాలక యిట్టికార్యముల చా • యన్ జేరి యిబ్బంగినిన్
బలుకం జెల్లునె నీకు, నిర్భయత; నీ • పద్మాక్షిపై నాకు ను
జ్జ్వలమోహం బొదవంగ దెచ్చితిని, నీ • వ్వాడైన వారింపఁగా
దలఁపుల్ బూని చరించినే, మదిని వం • తంగుందనీ కేటికిన్.

బృంద—నాథా! అగ్రహింపకుము. సాధ్వీమణుల నీవిధంబు సేయుట తగదని చెప్పుటకు సాహసించుచుంటిని. నాకు, నీపదాంబుజ సేవ యొసంగలేదని మైనను చింతింపనుగాని, యిట్టియకార్యము నా యెదుట జరుగుచుండ నేను సహింపఁగలనా? తుదకీకార్యములు బలవంతముగ నాప్రాణముఁదీయును, ప్రాణేశ్వరా! ఏమో పలికితి నని తలంపక, యీమెను విడిచివుచ్చుఁడు. (చారుమతిని సమీపించి)

తల్లీ! నీవు చింతింపకుము. నానాథుఁడొనర్చిన యపరాధమును సైరింపుము. నిన్ను మాయాశ్రమమునకు సుఖముగాఁ జేర్పించెదను. రమ్ము (చారుమతిని దీసికొని లోనికిఁబోవును)

జలం—(తనలో) గాలవుఁడు వచ్చుటచేత నీచారుమతి యిప్పుడు దప్పించుకొనినది. ఇప్పుడు బృంద యడ్డుపడినది. ఈభటు లీమెను బృంద యెఱుంగునట్లు దెచ్చుటచే నిట్లయినది.

సేవ—(ప్రవేశించి) మహారాజా! నారదమునీంద్రుఁడు వచ్చియున్నాఁడు.

జలం—(తనలో) ఈసమయంబున నీతఁడేల యరుదెంచెనో కదా (ప్రకాశముగా) మునీంద్రున కభ్యంతరమేమున్నది? శీఘ్రముగా లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము (నిష్క్రమించి వెంటనే నారదునితోఁ బ్రవేశించును)

నార—(తనలో) ఈజలంధరుని దుష్కృత్యము లంతకంతకు హెచ్చుచున్నవి. తక్కిన విషయము లెట్లున్నను బరదారాగమనము, అందులో మునిపత్నులను భంగమొనరింపఁ దలంచుట యెంతయు ఘోరముగ నున్నది. కానిమ్ము ఈతని దుష్కృత్యమునకు నేనుదోడ్పడి శంకరునితోఁ గయ్యము సంభవించినట్లు జేసెదను దానంజేసి కలహాభోక్తనగు నాకు సంతోష మొదవుటయేగాక, త్వరలోన దుర్మార్గుడడుగంటుటకూడ సంభవించును.

జలం—(ఆసనమునుండి లేచి) మునీంద్రా! వందనములు. ఈపీఠంబు నలంకరింపుము.

నార—(ఆసీనుఁడై) జలంధరా నీకు కుశలమేకదా?

జలం—మునీంద్రా! నీకటాక్షమునఁ గుశలముగనే యుంటిని. (ఇంచుక యూరకుండి) మహాత్మా! నీరాకచే నేను ధన్యుడనైతిని. ఇప్పుడు నీవెచ్చటికిఁ బోవుచు నిచ్చటి కరుదెంచితివో యానతిచ్చెదవా?

నార—నేనిప్పుడు కైలాసమునుండి వచ్చితిని.

జలం—కైలాసమున విశేషములేమి ?

నార—నే నక్కడ కరిగిన సమయమునఁ బరమేశ్వరుఁడు లేఁడు. గంగా పార్వతులు లేకారణముననో కలహించుచుండిరి.

జలం—పరమేశ్వరుని జీతకాలమంతయు నాసవతుల కయ్యములు వారించుటకే సరిపోవుచున్నది. ఇంతకును కలహకారణ మేమో నీకుఁ దెలిసెనా ?

నార—కలహకారణమేమో నాకును దెలియలేదుగాని పర్యవసానము మాత్రము దెలిసినది. గంగ పార్వతికినీవొకనిచేఁ బట్టుబడుదువుగాక యని శపించినది.

జలం—మునీంద్రా! తాను మహాసాధ్వినని యాపార్వతికి మిగుల గర్వమున్నది.

నార—ఈసంగతి నీవుగూడ గ్రహించితివికదా! ఆమెకొకసారి గర్వభంగము కావలెను. (ఇంచుకయూరకుండి) జలంధరా!

తే. గీ. అరయఁ బిచ్చుకపైన బ్రహ్మాస్త్రమన్న
పగిది, మానుల భార్యలఁ బల్మిఁబట్టి
దలఁచుచుండెద విదియేటి దర్పగుణము
బలముగల్గిన నా“సతి”ఁ బట్టుమయ్య.

ఇట్టి కార్యము నీవు చేయఁజాలితివేని నీయశము చతుర్దశభువనంబులయందును నిండును.

జలం—తాపసోత్తమా! ఈసంగతి మంచిసమయమునందే చెప్పితివి. నేనిప్పుడు పార్వతినిఁబట్టితినేని యామెకు గర్వభంగమగుటయే గాక, గంగ యిచ్చినశాపము గూడ నిజమగును.

నార—జలంధరా! మాటలవలనఁ బ్రయోజనము లేదు.

జలం—నారదా! నేను మాటలఁజెప్పువాడనుగాను.

ఉ॥ ఏనిదెయేగి యాసతిని • నింపు దలిర్పఁగఁ బట్టితెత్తు; శ్రీ
జానియు భారతీపతియు • శంకరుఁడున్ మఱి దేవబృందముల్
బూని రణంబుఁ జేసినను • బూర్ణపరాక్రమశౌర్యవృత్తినిం
గానఁగఁ జేసి యోర్చెద జ • గంబునఁ బ్రాకఁగ మద్యశోలతల్.

ఇప్పుడీమాటలతో నేమిఃపనియున్నది? పార్వతినిఁ బట్టితెచ్చి వచ్చెను నీవే చూచెదవుగాక!

నార—నీవు తలంచుకొన్నచో నెంతటిపనినైనఁ జేయగలవు - కాని శంకరుఁడు లేని సమయముఁజూచి యాకార్యము జేయుము. ఈవిషయమై నేను బ్రేరేచితినని యెక్కడను జెప్పవలదు. ఈ సంగతి యతిరహస్యముగా నుంచుము. నేనుపోయివచ్చెదను.

జలం—మునీంద్రా వందనములు.

నార—(ఈవలకువచ్చి) ఈయుద్యమమున నీతఁడు ప్రవేశించెనేని రుద్రుని కోపానలజ్వాలలకు భస్మమగుట నిశ్చయము. అట్లుగాక బృంద మంగళసూత్రమహిమంబున నీతఁడు బ్రదికెనేని యప్పుడింకొకమార్గము జూడవచ్చును. (నిష్క్రమించును)

బృంద—[ప్రవేశించి] నాథా! నారదుండు కాబోలిప్పుడు వచ్చినాడు!

జలం—అవును. (ఇంచుకయూరకుండి) చారుమతిని బంపివేసితివా?

బృంద—ఇరువురు సేవకులను, నొకచెలికత్తెను నామెకుఁ దోడిచ్చి, గాలవుని క్షమాపణ కోరుకొనుమని చెప్పిపంపితిని. నాథా! ఇంక నీ వెప్పుడును నిట్టి యకార్యము లాచరించవలదని నా ప్రార్థన.

జలం—నేనొనర్చుచుండు నిట్టి కార్యములన్నిఁటికిని నీవు విఘాతము గలిగించుచుంటివి.

బృంద—నాథా! నాబ్రదుకు నీకంతకష్టముగ నున్నచో భయదీయహస్తాలంకృత కృపాణముతో నాకంఠమును దెగవేసి సుఖింపుము. అంతియెగాని యిట్టి యకార్యములకు నేను సమ్మతింపను.

జలం—(కోపముతో) సరే, ఇప్పుడీచర్చ యెందుకు? నేనిప్పుడు కైలాసమున కరుగవలయును.

బృంద—పరమేశ్వరుని సందర్శించుటకా?

జలం—కాదు. కాదు. మహాసాధ్వియని చెప్పుకొనుచుండు పార్వతికి గర్వభంగ మొనర్చుటకు.

బృంద—(తొందరతో) ఆ! ఏమిది! పార్వతికి గర్వభంగమా!

జలం—అవును. ఇందుకు సందియమేమున్నది?

మ. అమరుల్ భీతిల, సిద్ధయక్షగణ మా • హాకారముల్సేయ, శ్రీ
రమణుండున్ హరుడున్ విధాతయును సం • గ్రామంబునన్ నిల్చి దు
ర్దమశౌర్యంబును జూపినన్ విడువకే • రాజద్బలాటోపతన్
గమనీయోజ్వలదేహ నాసతిని వే • డ్కన్ బట్టి తోడ్తెచ్చెదన్.

బృంద—(భయము నటించి) హా! నాధా! ఈబుద్ధి నీకేపుట్టెనా! ఎవ్వరైనా బోధించరా! లోకమాతయగు పార్వతియేడ! నీవేడ! ఆమెకు గర్వభంగ మొనర్చుటేడ? ఇట్టి యకార్యము సేయుట యాత్మనాశనమునకుగాదా! నాధా! ఇందుకు నేనేమని వగతును;

తే. గీ. శక్తిరూపిణి యైన యా • సాధ్విఁజేర
నెంచుటదిచూడఁ ఫలమందు • నెంచి యెగసి
యగ్నిఁ బడెడి మిడుత చంద • మగుగాదె
వలదు నీకిట్టి కార్యంబు • వలదు వలదు.

తే. గీ. నీదు జన్మకు మూలమౌ • నీలగళుని
దేవి యైనట్టి సతిగా బం • ధింపఁదలచు
టెంత దుష్కార్యమో మది • నెంచినావె?
తల్లి కడుపుచైఁ గొట్టంగఁ • దలఁచు నెవఁడు.

ప్రాణేశ్వరా! నీచిత్తము నాయుద్యమమునుండి మరల్చి సుఖింపుము.

జలం—శరణీ! నీవు నాకెట్టిభయమును గొలుపవలదు. నేను తలంచిన కార్యము నెరవేరువఱకును నిద్రించు వాడనుగాను. నీ వీ విషయమున మారు బలుకకయుండుము.

బృంద—హా! నాథా! ఇదియేమి సాహసము?

సీ. వరదేవతాకృపా ♦ బ్రాప్త భూపాలకై
శ్వర్యభోగంబులు ♦ చాలలేదొ
మహనీయమణిమయ ♦ మందిరాంగణవాస
సౌఖ్యసంతోషముల్ ♦ చాలలేదొ
సకలసామంతరా ♦ జన్య సమూహంబు,
సలుపుచుండెడి నతుల్ ♦ చాలలేదొ
అతిలోకనిర్మల ♦ ప్రీతిభావరాక్రిన,
శౌర్యసాహసములు ♦ చాలలేదొ
తే. గీ. పరుల గాంతలఁబట్టెడి ♦ పాపమునకు,
దోడు; పార్వతి దేవినిఁ ♦ గూడఁ బట్ట
సాహసించుచు నుంటివి ♦ శౌర్యవృత్తి
నమ్మహాదేవి మహిమంబు ♦ నరయలేక.

నాథా! ఈ ప్రపంచమంతయు నాకు నీతోడనే యున్నది. నాయందు నీవు కరుణించక నీ పదసేవకు నన్ను దూరముగఁ జేసినను నిరంతరము నీ సేవ హృదయమునందే సేయుచు సాధ్వినై యుంటిని. అట్టిచో నీవిప్పుడు సతీదేవినిఁ బట్టనరిగి నాకు దురంతచింత గూర్ప వలదు.

జలం—నేను నీయెదుట నున్నంతవఱకును నేదియో యనవసరమైన సంభాషణ సేయుచునే యుందువు. నేనిదే కైలాసమున కేగి, సమయము వేచియుండి సతీదేవిని బంధించుకొని వచ్చెదనుగాక! (నిష్క్రమించును.)

బృంద—హా నాథా! నాథా! (పరికించి) ఇంకెక్కడ నాథుఁడు! ఈతఁడు నామాటలు పెడచెవింబెట్టి శైలతనయార్థమై యరిగినాఁడు ఇప్పుడు నేనేమిసేయుదును? ఎవ్వరిని వేడుకొందును? ఈతఁడట్టియకార్యము సేసెనేని త్రినేత్రుని కోపాగ్నిజ్వాలలందఁబడి భస్మముగాకయుండునా! అక్కటా ఈతఁడెట్టి సాహసకార్యము సేయనెంచెను (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నేను విచారించుచున్నందవలనఁ బ్రయోజనములేదు. నేనుగూడనరిగి నాథుని యత్నమును గనిపెట్టుచు నా శక్తికొలఁది వారింపఁ బ్రయత్నించెదఁగాక.

[నిష్క్రమించును]

ఇది తృతీయాంకము.



రుద్రునికోపానల జ్వాలలకాహుతికాఁగోరియే నన్ను నేడిట్లు బట్టుటకు సాహసించితివి.

పలం——సుదతీమణీ! ఈ యనవసర సంభాషణతో నేమిఫల యున్నది? నేనొకమాటఁ జెప్పెదను వినుము.

సీ. ఆవాస మెన్నంగ • నతిభయంకరమైన
భూతంబు లుండెడి • ప్రేతభూమి
ఆహార మెంచంగ • నన్యులెవ్వరు దరి
జేరగాఁ జాలని • ఘోరవిషము
వాహనంబు దలంపఁ • బరిహాసముగ సేయ
నిరతంబు దలయూచు • వృషభమూర్తి
బిచ్చమెత్తఁగ నెంచి • వేడ్కమై హస్తంబు
నఁ ధరించినది యా • నలువ శిరము
తే. గీ. పాములే నగలు, హితులు • ప్రమథగణము
గాఁగ జరియించుచుండు నీ • కాంతుఁడేమి
సౌఖ్యముల నీయఁజాలును • సారసాక్షి
రమ్ము పోదము నాదు పు • రమ్మునకును.

జాగుసేయక లెమ్ము, (సమీపించును.)

సతీ——తులువా! దూరముగానుండుము- పరమేశ్వరుని మహామహిమ లెఱుంగక యిట్టి యకార్యమును జేయవచ్చితివి. నిన్ను నేనేదగ్ధము జేయగలుగుదును గాని, నాథునియాజ్ఞ లేక పోవుట చేతను, నీభాగ్యయు, సాధ్వీశిరోమణియునగు బృందం జూచియుఁ గరుణించితిని. ఇంతవఱకును పాపనుల నేచుచుఁ దత్పత్నులఁ బలిమిబట్టుచు నార్జించిన ఘోరపాపము చాలక నాకడకుఁగూడ వచ్చితివా?

జలం——సతీమణీ! నీవు నన్నిట్లు తృణీకరించి పలుకవలదు. నీ సౌందర్యమున కీశ్వరుఁ డెంతయుఁ దగనివాడు.

జలం—శైలతనయా! నాబారిఁబడిన నీవెచ్చటి కరిగెదవు? నీ లుపము నిన్నిప్పుడే నాపురికిఁ జేర్చెద. జలంధరుఁడు పట్టినపట్టువిడుచువాడుకాడు. (సమీపించి పట్టుకొనబోవును)

సతి—(పరమేశ్వరుని నుద్దేశించి) హా! పరమేశ్వరా! నీవెచట నుంటివి ఈజలంధరుఁడు దుర్మార్గుఁడైనన్ను బట్టదలంచుచున్నాడు. స త్వరముగ వచ్చి రక్షింపుము.

జలం-

మ॥ జలజాక్షీ భవదీయనాథుఁడగు నా ♦ శంభుండె యేతెంచి యు
జ్జ్వలదర్పంబున నిల్వనిమ్మనఁడుమ ♦ చ్ఛౌర్యంబునన్ సంగర
స్థలినిన్ వానిని రూపుమాపి సురబృం ♦ దం బెల్ల భీతిల్లఁగా
బలిమిన్ నిన్ గొనిపోదు నాదుపురికిన్ ♦ బల్మాటలింకేటికిన్.

(పట్టుకొనబోవును.)

సతి—(తప్పించుకొని అటునిటుజూచుచు) ఓరీ! కలుషాంధకారపరిమత్త హృదయా! దూరముగానుండుము.

జలం—హిమగిరితనయా! నేను రుద్రునికి భయమందుదు నని తలంచితి వేమో (దగ్గరకు బోవును)

(తెరలో)

చెలీ! పార్వతీ! పార్వతీ! ఇదియేమి, నిన్ను బట్టదలంచుచున్న యీదురాత్ముఁ డెవడు? పరమేశ్వరుడీ ప్రాంతము నందె యున్నవాడు ఆతని కెరింగించెదఁగాక నీవు భయపడవలదు.

సతి—(తనలో) ఇంక భయములేదు. ఈదురాత్ముడు నాథుని క్రోధానలజ్వాలల కాహుతియగును.

జలం—(తనలో) ఓహో! ఈమె చెలికత్తె యీప్రాంతము నందే యున్నదికాబోలు. ఈవార్త శివునికెఱింగించిన నాతడు రాగలఁడు

ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) శివుఁడొక్కఁడే కాదు. అత నికిఁ దోడింకెవరైన రానిమ్ము. సతిని మాత్రము విడువకయుండుదు గాక! సాధ్యమగునంతవఱ కాతఁడు రాకమునుపే యీ కాంతను బంధించుకొనిపోయెదను. (సతిని సమీపించి) లెమ్ము, లెమ్ము. ఇంకఁ గాలహరణమునకు నాచిత్త మొప్పదు.

సతి—దుర్మతీ! నీకుఁ గాలము సమీపించినది. ఉండుము.

(తెరలో)

మ. సురముఖ్యుస్తవనీయమైన సతినిఁ ♦ జొంహార బంధింప, నే
దురితాత్ముండు దలంచె, వానిని జగ ♦ ద్ద్రోహిన్ నిమేషంబులో
సురబృందంబు నుతింప శూలమున ని ♦ ర్భ్చేఁ జావగాఁజేతు, ని
ర్భరమత్కోపదవానలంబును సహిం ♦ పన్ శక్యుఁ డెవ్వాఁడగున్.

పర—(పై పద్యమును జదువుచుఁ బ్రవేశించి యిటునటు జూచుచున్నాఁడు.)

పార్వ—(పరమేశ్వరు నుద్దేశించి) హా! నాథా! దుర్మార్గుఁడగు జలంధరునిచేఁ జిక్కిన నన్ను రక్షింపుము.

పర—(జలంధరునిజూచి) ఓరీ! దుర్మతీ! నీవా! ఇట్టి సాహసకా ర్యమునకు సాహసించితివి.

ఉ. భూమిసు నివిధంబునను ♦ బట్టఁగనెంచిన నిన్ను మామకో
ద్దామ కుఠారాగ్ని కాహుతిగఁ ♦ దప్పక చేసెద జూడు మిప్డు సా
ర్వ్యమును లెల్లరున్ మదుల ♦ భీతిని వీడి చరింపఁగా, ముని
స్తోమము గూర్చిరఁ డీగ్గెనను ♦ చున్ ముదమందగ దుర్మదాధమా

(సమీపించి) ఓరీ! జలంధరా! ఇంతవఱకును నీవు చేయుచుం డిన దుష్కృత్యములఁనుగూర్చి నేను వినియు, నెవరు జేసిన పాపము వారే యనుభవింతురని యూరకుంటిని. ఇప్పుడు నీసి తుంపాక్షో శి

భృత్యకోట్లకును గూడ జట్టుటకు సాహసించితివిగా! ఇంతకును నిన్ను స
వేసిన బని యేమిలేదు. నా కారణంబున జనించిన నీ వనామకుం
డవై యుండకుండ, విష్ణుక రాజుగా జేసి, వరంబులిచ్చి నందుకు
మాకుం గలిగిన ప్రతిఫల మింతియే కదా!

తే. గీ. ఎఱుకమాలిన వారల ♦ కెంత మేలు
గూర్చిన దానిం దెలియంగ ♦ లేరు జగతి
బిడ్డయని యెంచి మెడమీద ♦ బెట్టుకొనిన
దేహ మంతయు జెఱచుగా ♦ దే! దురాత్మ.

జలం—(పరమేశ్వరునిం జూచి) శంకరా! నీవాక్యము లకిచ్చుట భ
యపడు వారెవ్వరును లేరె, భాగ్యభోగంబులు లేక, జోగివలె నిరంత
రమును బ్రేతభూమిని విహరించు నీకీ సౌందర్యవతియగు నెలనాగ
యేల? ఈమెను నాకొసంగుము ఎట్లయినను నీమహిమచలాత్మజను
గొనిపోవుటకే వచ్చితిని. నీవు మాటలతో నొసంగవేని నిన్ను రణం
బున నిర్జించియైనం దోడ్కొని పోయెదను.

పర—ఛీ! మాతృద్రోహీ! ఇట్టి యవ్యక్త ప్రలాపంబులాడకుము.

మ. సముదాటోప పతంగపుంగవవిభా ♦ స్వదీర్ఘ చంచూసమ
క్షమునం దల్ప పణావిజృంభణసట ♦ త్కాకోదరంబట్లు శౌ
ర్యమదోద్రేకుడవౌచు నన్నిపుడు జ ♦ న్యక్షోణినిందాకం జి
త్తమునం దెంచితివే దురాత్మ గాకం నీ ♦ దర్పంబు వారించెదన్

నా పరాక్రమమును గూర్చి నీవిదివర కెన్నండును వినియుండ
లేదు కాబోలు?

జలం—విని యుండకేమి?

మ. గరిమన్ నిన్నెదిరించు వీరవరుండౌ ♦ క్కండైన లేకుంటచే
వరదారన్ భవదీయశౌర్య మనివా ♦ ర్యంబై సుధీన్మూఖ్యభా

స్వర సంస్తోత్రిత కర్ణామై కిడు బ్రికా • శంబమ్యో; నింకఁ జలం
ధరుమోల్లిఁ భవదీయ చిక్రీమమున్న • ర్థంబా నుమావల్లభా.

ఈ జలంధరుఁడు రాజాధిరాజై విలసిల్లుచుండెనని యెఱుఁగవా యేమి?

పర—ఓరీ! నీవు రాజాధిరాజువని గర్వించుచుంటివా? ఇటు వినుము. చిత్రాభరణపట్టిశఁ బ్రకాశించుటయుఁ, జానురాగలావృత్తినిఁ గనుటయు, మదోన్మత్తకామినుల పెట్టఁబడుటయు, మానస్వభావము చంపుటయు, వాస్యభ్యసనితో స్వారి వెడలుటయు, బహుల మారంబు గాఁ దప్పుచుటయు, దనవారివాక్యము లెప్పి తెలుసూనుబడుఁ, జుట్టును ననేకులచేఁ బ్రశంసింపఁబడుచుండుటయు, రాజ శోత్రుఁడైన కీర్తి యుండవలెను. ఇవి యన్నియు గాంగిరెద్దునకుఁగూడ నున్నవి ఓరీ గర్వచిత్తా! వివేకజ్ఞానశూన్యుఁడవైన నీవు రాజువైననేమి కాకున్ననేమి?

సతి—(పరమేశ్వరునితో) నాథా! దుష్టచిత్తుఁడగు వీనితోఁ గాలయాపనమేల?

జలం—నిజమే వ్యర్థావచనములతో నేమిపనియున్నది? (పరమేశ్వరునిఁజూచి) ఓయీ! పత్నీవచనవిహారీ! నేని శైలసుతను వోపోవలని పోవుటను నీవు సమ్మతింతువా? లేక రణంబునవిల్చి నాతోఁ బోరెదవా?

పర—(కోపముతో) దురాత్మా! ఏమంటివి? (త్రిశూలముచేఁ బొడువఁబోవును.)

జలం—(తప్పించుకొని) రమ్ము: రమ్ము.

ఉ. ఆహవనామ కాధ్వరము • నందు మదీయభుకోద్యాలత్సదా
నాహతచాపముక్తవిశి • ఖాస్త్రహుతాగ్నికి నిన్నునిప్పు డా

జ్యాహూతిగానొనర్చుచు ర ♦ యంబున నీమెను గొంచుబోవు మ
త్సాహసవిక్రమక్రమము ♦ శౌర్యము జూతుము భూతనాయకా!

పర—(కోపముతో) నీతో రణముగూడ సేయవలయునా?

మ. తరుణిన్ సాధ్విని లోకమాతను, సురేం ♦ ద్రస్తుత్యపాదాంబుజన్
బరిభావింపఁగఁ బాపమానసుడవై ♦ భావించుటేగాక, సం
గరమున్ జేయఁగ నెంచుచుంటివె భళీ ♦ కష్టాత్మ నాతోడ, భీ
కరశక్తిన్ బొలియింతు నిన్నిపుడెలో ♦ కంబుల్ ముదంబందగన్

దుర్మదచిత్తుండవగు నిన్నింకను బ్రతుకనిచ్చితినేని, లోకముల కపకారము జేసినవాడనగుదును. ఇదిగో! శక్తినిఁ బ్రయోగించి నీప్రాణముల హరించెదఁగాక.

[అంత తొందరగా బృంద ప్రవేశించును.

బృంద—(పరమేశ్వరుని పాదములపైఁబడి)

తే. గీ. శంకరాయ భక్తజన వ ♦ శంకరాయ
కంధరాయ మహానీల ♦ కంధరాయ
పురనిశాచర వర్గాశ ♦ పురహరాయ
పార్వతీరమణాయ తు ♦ భ్యంనమోస్తు.

మ. నతసర్వామ్నశీర్షసన్మకుట సం ♦ తానఁబునన్ వేని కాం
తితతుల్ భానుని మించుతేజమున నం ♦ దీపించుచుం డెవ్వి. నం
స్తుతనానామునిభక్తమానసగృహ ♦ స్తోమంబులన్ దివ్వెలై
నుతినింగాంచెను నట్టినీ పదములన్ ♦ గొల్తున్ సదా భక్తితోన్

పరమేశ్వరా! సర్వాంతరాళానువర్తీ! పుణ్యమూర్తీ! బుధతాత్రిణలోలా! భవదీయపాదారవిందస్మరణము, ఖగేశ్వరుఁ డహిప్రాణమును హరించు చందమున, సమస్తపాపములను నశింపఁ

జేయును. ఆ రత్నైన నేను నీ కరణంబు వేడుచుంటిని, నీవు కోపమున గన్ను దెఱచి చూచితివేని, యీతఁ డెంతవాఁడు? నా నాథుఁడు సద్గుణమూర్తియని నేను చెప్ప సాహసింపను. నాసాధ్వీత్వము దిల కించిత్తైన నీతనిని రక్షించి నాకుఁ బతిభిక్షఁబెట్టుము.

తే. గీ. అతని జన్మంబునకు గారణం ♦ బనఘ! నీవు
గాన నీకటాక్షంబునఁ ♦ గాదె యిట్టి
వైభవంబునుబొందుచు ♦ వరలుచుండె
నీవు పెట్టినదీపంబు ♦ నీవె యార్ప
దలఁచు టియ్యది ధర్మమే ♦ లలితతేజ.

(పార్వతినిఁ జూచి) హే! జగజ్జననీ! భవన్మహామహిమ నెఱుంగ లేక, నీయెడల నకార్యము సేయనెంచిన నా ప్రాణేశ్వరునిఁ గాపాడుము. (జలంధరుని సమీపించి) నాథా! ఇది యేమిసాహసము? జగజ్జనని యగు సతీదేవినిఁ బట్ట సాహసించితివి? ఒక్కసారి మహేశ్వరుఁడు కోపదృష్టితోఁ జూచెనేని లోకములాగునా! చాలుఁ జాలు సాహసము, తొలుతఁజేసిన సాహసము చాలకయే దేవాది దేవుని మహితకరుణఁ గాంచగోరి మునీంద్రులు పరమనిష్ఠా గరిష్ఠులై తపము సేయుచుందురో యట్టి భగవంతుఁడగు నీలగళునితోఁ గయ్యముగూడ సేయనెంచితివా? నాకు వైధవ్య దుష్టాలంకారము గూర్పఁదలంచి యిట్టి సాహసోద్యోగమును బూనితివని తలంచెదను. ప్రాణేశ్వరా! ఇంకనైనఁ జేసిన యపరాధమును మన్నింపుమని యీ పురాణదంపతులను ప్రార్థింపుము.

జల—రమణీ! ఈ సమయంబున నీవిక్కడికేలవచ్చితివి? నా యుద్యమమున కేలభంగమొదవించెదవు? రణమున కీపురహరుఁడేగాదు. చతుర్దశభువనములును నొక్కపెట్టున నెత్తివచ్చినను వెనుదీయువాఁడను గాను పొమ్ము.

పర—బృందా! గురుద్రోహియగు నీతనికి నాతోఁ గయ్యమొనర్చుట కిచ్ఛజనించినది కాబోలు. రానిమ్ము మదీయ కోపాగ్నికింధనమగుఁగాక!

బృంద—తుషారభృత్కన్యకారమణా! నన్నుఁజూచియైన నీ వాగ్రహంబును విడువుము. పుత్రుఁడపరాధ మొనర్చినఁ దండ్రి రక్షింపవలయును గదా! ఈతఁడేమి? నీతోఁ గయ్యమొనర్చుటేమి?

సీ. భక్షింపవే లోక • పరితాపమును వాన
నాభీలహాలహా • లానలంబు
రక్షింపవే యార్త • రక్షాయనుచు నీదు
పదముల సేవించు • భక్తసమితి
శిక్షింపవే సుర • శ్రేణికి సౌఖ్యంబు
నమరఁజేయఁగ ద్రిపు • రాసురులను
వీక్షింపవే సార్వ • విశదార్ధమై భస్మ
మైపోవునట్లు ర • మాకుమారు
తే. గీ. నన్ను రక్షింపవే యింక, న • నాథనైన
బ్రతుకజాలను గాన నా • భర్త నేసె
నట్టి దుష్కార్యమెంచక • యాత్మఁ గాన
భక్తజనమానసోల్లాస • పార్వతీశ.

సతి—(పరమేశ్వరునిఁజూచి) నాథా! జలంధరుఁడు నాయెడల దుష్కృత్యము సేయఁదలంచినను, సాధ్వియగు బృందనుజూచి, యాతని గరుణింపనగును

పర—(బృందనుజూచి) బృందా! నిన్నుఁజూచి, నీనాథునిరక్షింపకతప్పదమ్మా. (జలంధరునిఁజూచి) జలంధరా! ఇట్టి యవివేకకార్యములనింక నెన్నఁడును సేయఁదలంపకయుండుము. బృందమంగళసూత్రమే నేఁడు నిన్నుఁ గాచినదని తలంపుము. పొమ్ము.

బృంద—ధన్యురాలనయితిని పార్వతీ పరమేశ్వరులారా! నిరంతరము మీ దివ్యనామసేవ నాహృదయంబునఁ బాదుకొనియుండునట్లనుగ్రహింపుము.

సతి—సాధ్వీ! పోయిరమ్ము శుభమగుగాక! (పరమేశ్వరుని గాంచి) ప్రాణేశ్వరా! ఇంక మనమరుగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

బృంద—రాధా! నేఁజెప్పినమాటలు వినక పరమేశ్వరునిబట్టఁ దలంచివచ్చితివి. పరమేశ్వరున కాగ్రహము పూర్తిగావచ్చినచో నా గతియేమగును? ప్రాణేశ్వరా! ఇంకను నీచిత్తమునిట్టి యధర్మకార్యములందు బ్రవేశపెట్టుచు నాకుజింతఁగూర్పక కరుణింపుము. రమ్ము.

జలం—(తనలో) ఆనాఁడు శంఖునిపత్నియగు చారుమతిని భంగము సేయఁదలంచ, నష్టపడినది. నేఁడీ సతీదేవి విషయమునఁగూడనట్లే చేసినది. ఇది బ్రతికియున్నంతవఱకు నా యుద్యమము లన్నిటికిని భంగము దప్పదనే తలంతును. కావున నేమూపాయముననో, దీనిఁ గడతేర్పవలయును. (ఆలోచించి) సరే! ఇంకొక మంచియుపాయమే తోఁచినది. ఈపర్వతముపై నున్న చిత్రములఁ జూపుచు, నామూలకుఁ దోడ్కొనిపోయి దీనినిపైనుండి సముద్రమునఁ బడునట్లు ద్రోసివేసెదను. (ఇరువురును నిష్క్రమింతురు)

[రంగము. (2) కొండపై జలంధరుఁడు-బృందయుఁ బ్రవేశము]

బృంద—రాధా! ఆలోచించుచుంటివేమి?

జలం—(తనలో) చిత్తమున నున్న కోపమునంతయు బయలు పెట్టరాదు. (ప్రకాశముగా) రమణీ! ప్రకృతిసౌందర్యమునకద్భుతమందుచున్నాను. ఇటుఁజూడుము. చిరత్నరత్నమయ నిశ్రేణికా శ్రేణీ బ్రమదాభ్రంకషోత్తుంగ శృంగంబులెట్లున్నవో గంటివా? ఆక్రింద భాగమీక్షింపుము. ఘుమ ఘుమ పరిమళించు సితాంత వాసంతికా మల్లికా నవమల్లికా మతల్లికల నల్లిబిల్లిఁగొని, మదనకదనంబున నదమదంబులగు త్రిదశవిటీవిట పటలంబున కప్రమత్తంబున బ్రాపించిన సంకేతసదనంబులం దనరు పొదలెంత చిత్రముగ నున్నవో!

బృంద—రాధా! ఇటుఁజూడుము. తమచక్కదనమునకువిద్యాధరీకాంతల మక్కువ బడజేయుచు, దమకఱచిన యురగసంతతులఁబాఱవైచి. వానిని మాటిమాటి కక్షీణపక్షివిక్షేపణంబులనడంచి యుఁ

...ంచూపుటంబులఁ బొడిచియుఁ బగిష చరణాగ్రంబుల నడిచియు, ఖరనఖరంబులఁ జేరియు, దీఱనికినుకతో వివిధగతులఁ జెలంగు బ్యాఘ్రగణము లెట్లున్నవో!

జలం—సహజ సౌందర్యమునకేదియు సాటిరాదుకదా! అరణ్యంబునగల మృగసంతతులపై నొకసారి దృష్టిఁబఱపుము.

సీ. గండభేరుండముల్ • గడురంహు లిడఁజూచి
సత్వరంబుగఁబాఱు • శరభచయము
శరభంబులేగెడి • చప్పుడు వినవచ్చి
తరులచాటున డాఁగు • హరిగణంబు
హరిగణధ్వానంబు • నాలించి నిశ్చేష్ట
త వహించి నిలచు మ • త్తగజసమితి
మత్తసామజముల • మార్గంబు వీక్షించి
శీఘ్రంబుగాఁబాఱు • చిఱుతగండ్లు

తే. గీ. చిఱుతగండుల చప్పుడు • చెవికిఁదగల
చెంగు చెంగునదాటుచు • రంగతతులు
గలిగిమిగుల చిత్రంబుగా • జెలగుచున్న
నమ్మహావనిగంటి వా • యబ్జనేత్రి.

ఇంకను మనమామూలనుండి చూచినచో మఱింత చక్కఁగ గానిపించును. రమ్ము. (ఇంచుక నడచుచున్నారు)

బృంద—(క్రిందకుఁజూచి) ఈపర్వతాగ్రమునుండి, సముద్రమువైపు చూచినచోఁ గన్నులు తిరుగుచున్నట్లుండును.

జలం—తరుణీ! ప్రభాకరబింబము జలములయందెట్లు ప్రతిఫలించుచున్నదో చూచితివా?

బృంద—(సముద్రమునుఁ జూచుచుండును)

జలం—(తనలో) ఇదియే సమయము.

[బృందను సముద్రమునఁ బడునట్లుద్రోయును.]

బృంద—హా! (అనుచు సముద్రమునఁ బడుచున్నది.)

జలం—నేఁగలంచిన పనియైనది. (నిష్క్రమించును)

[ తె ర లే చు ను ]

సముద్రము:—[బృందజలములలో నిటునటు గొట్టుకొనుచు నుండగా విష్ణుమూర్తి-ప్రవేశించును.]

బృంద—(జలములందుండి) నారాయణ! నారాయణ!

విష్ణు—(జలమునందున్న బృందనుజూచితనలో]అక్కటా!దురాత్ముండగు జలంథరుఁడీ బృందయెడల నెట్టిదుష్కృత్య మొనర్చినాఁడు! నేనిప్పుడీమెనురక్షించెదఁగాక. (జలములలో దిగి) సాధ్వీమణీ! భయ మందకుము. ఆర్తరక్షకుఁడనైన నేను నిన్ను రక్షించుచున్నాను.

(బృందను దీసికొని యొడ్డునకు వచ్చును.)

బృంద—(విష్ణుమూర్తినిఁజూచి) శాశ్వతసౌఖ్యము నందుటకై విధిప్రేరణమున నిందుఁబడిననన్నురక్షించితివేల? మహాత్మా! కరుణామయుండవైన నీవెవ్వరవో యెఱుంగవచ్చునా?

విష్ణు—బృందా! ఇంతలోనె మఱపా!

తే. గీ. ఏను నీహృదయంబున • నెపుడునిల్చి
యుంటి; నీవునామదిలోన • నుంటి వెపుడు
నఖిల భక్తులహృదయంబు • లందు నరుల
నన్ను నెఱుఁగకుంటివె నీవు • నాతిమిన్న.

బృంద—[తనలో) ఓహో! ఈతఁడు శ్రీమన్నారాయణుఁడు. మునొక్కసారి యీమహానుభావుండు తనజగత్కల్యాణరూప సందర్శనము నాకొసంగి, మదీయగుణపరీక్షార్థమైనన్ను మోహించినట్లునటిం

చినాడు భగవంతుడు భక్తజన మానసంబుల ననేకవిధంబులఁ బరీక్షించుచుండునుగదా! (ప్రకాశముగా) ఆర్తరక్షామణీ! భవదీయ దివ్యమంగళ విగ్రహమొకసారి దర్శించియుండియు, నేడజ్ఞానంబునం బడి కనుగొనలేకపోయితిని. మన్నింపుము.

మ. కలనైనన్ సులభంబుగాదు భవదాకారంబు దర్శింప, నా
నలినప్రోద్భవ ముఖ్యదేవతలకై నన్ నేడు మల్లోచనో
త్పలముల్ ధన్యతగాంచి మించగభవ ద్భద్రాయి తాస్యేందుమం
డలి వీక్షించితిఁ గ్రమ్మరన్ వివుల పుణ్యంబెట్టిదో మాధవా.

నను(గ్ర)మునఁబడిన నేను ప్రాణముల బాసియుంటి నేని నీసాన్నిధ్యమునుఁ జేరియుందునుగదా! నన్నేల రక్షించితివి?

విష్ణు—భక్తరక్షణము నాయుద్యోగమేకదా! (లోపలో) ఈమె జలంబునఁబడుటకుఁ గారణమడిగిన నేమనిచెప్పునో (ప్రకాశముగా) నారీమణీ! నీవీజల మాసిం బడుటకుఁ గారణమేమి?

బృంద—భగవంతా! నాపురాకృత ప్రారబ్ధమని చెప్పుటకంటె వేఱేమియుఁ జెప్పజాలను.

విష్ణు—పతి నిరాదరణమే కారణమని యూహించెదను.

బృం—(మాటలాడకయుండును.)

విష్ణు—నిరుత్తర మంగీకారసూచకమా!

బృంద—దేవా! ఇప్పుడీ యనవసరమైన సంగతియేల?

విష్ణు—బృందా! నీభర్తచేసిన యకృత్యము నీవు చెప్పక దాచినచో నాకుఁ దెలియదనుకొంటివా?

బృంద—సకలాంతర్యామివగు నీకుఁదెలియనివిషయమేమున్నది?

విష్ణు—నీయందట్టి నిరాదరణభావము వహించిన పతినిఁ బట్టుకొని యేల ప్రాకులాడెదవు? జగన్మోహనుఁడనగు నాయభీష్టము దీర్చి సుఖంబుల బడయుదలంపవేల?

బృంద—లోకేశ్వరా! నాహృదయమిదివఱకే నీకుఁదెలిసియున్నది. ఇంకను నన్నేల పరీక్షించఁదలంచెదవు?

ఉ. దేవుఁడవైననుఁగాని మఱి • దేవుని యబ్బవునైనఁగాని; నా
భావమధర్మమార్గమున • వర్తిలనెంచదు వేయునేల నీ
వీవిధిఁ బెక్కుభంగులను • నేల పరీక్షను సేతు వయ్య ల
క్ష్మీవర! భర్తృసేవ సతి • కిల సకలార్థము లిచ్చుగాదొకో!

విష్ణు—పోనిమ్ము. ప్రాణదానముచేసినందులకు నాకేమి యుపకారము సేయుదువు?

బృంద—మహాత్మా! ఉత్తమపురుషు లెవ్వరును నుపకారమొనర్చి ప్రత్యుపకారము గోరరు. భువనాధీశ్వరుండ వగు నీకు నేను ప్రత్యుపకారము సేయఁజాలినదాననా! నీపాదారవిందసేవపై నిరంతరము నాచిత్తము దగిలియుండునట్లు మాత్రమనుగ్రహింపుము.

విష్ణు—అట్లయిన నీవిప్పుడు నాయాజ్ఞననుసరింపుము.

బృంద—అధర్మముగాని యెట్టికార్యమునైనఁ జేసెదను.

విష్ణు—నీవిప్పుడాబృందావనంబున నుండుము. నీనాథుఁడుతనంతతానే నీకడకు రాఁగలఁడు.

బృంద—పతిపదసేవ చిత్తమునందుఁ జేసికొనుచు, భగవదాజ్ఞననుసరించెదగాక!

(నిష్క్రమింతురు.)

రంగము:—(3) వైకుంఠము—విష్ణుమందిరము మందు:—
ఇంద్రుడు—గాలవుఁడు—ప్రవేశము.

ఇంద్రు—మునీంద్రా! గాలవా! జలంధరుఁడుసేయు దుష్కృత్యములు నానాటికి హెచ్చుచున్నవిగాని తగ్గుటలేదు. ఇంక నెన్నాళ్ళిట్లోపికఁ బట్టగలము?

గాల—అతని దుష్కృత్యములన్నియు శ్రీమన్నారాయణుఁడుచూచుచుండియు నిట్లు శాంతివహించి యుండుటకుఁ గారణమూహింపఁజాలక యున్నాను.

ఇంద్రు—తాపసోత్తమ! "అడుగనిదే యమ్మయైనను బెట్ట" దనుసామెత నెఱుంగవా? (ఇంచుక యూరకుండి) ఇప్పుడుదానింగూర్చి యోచింపనేల? భగవంతుఁడగు శ్రీహరికి జలంధరునిఁగూర్చి విన్నవింతము. కరుణాసముద్రుఁడగు నాతండెట్లు చేసినను సరే.

గాల—(ఎదుటఁజూచి) భగవంతుఁడు మందిరమున లేడాయేమి? అయినను నిట్లు బిలచిచూచెదఁగాక ?

(ఎదుటఁ జూచుచు)

సీ. మా మొఱలాలింపవు • మహనీయ వటపత్రి
సీమపైనిద్రకుఁ • జేరినావొ
కరుణఁజూపింపవు • కమలాలయాదేవి
నెడబాయఁజాలక • యొసఁగినావొ
కాపాడనెంచవు • నీపదంబులభక్తిఁ
జింతించు వారికిఁ • జిక్కినావొ
రక్షింపఁజూడవే • రాక్షసాధమునైన
నాలంబునకుఁగూల్చ • నరిగినావొ
తే. గీ. కాకయుండిన నారికిఁ • గలుషచిత్తుఁ
డె జలంధరుఁ డొనరించు • నట్టి క్రూర
కార్యములఁ గాంచు నుండియు • గాననట్లు
సైచియుంటివి యిదియేమి • జలరుహాక్ష.

ఇంద్రు—అదుగో! శ్రీమన్నారాయణుఁడు మనకుదర్శనమొసంగుటకిట్లు వచ్చుచున్నాడు.

(విష్ణుమూర్తి—ప్రవేశించును.)

ఇంద్రు—(విష్ణుమూర్తిఁజూచి) లక్ష్మీకళత్రా! వందనములర్పించు చున్నాను.

విష్ణు—మహేంద్రునకు శుభమగుఁగాక! (గాలవునిజూచి) మునీంద్రా! వందనములు. (ఇంచుక యూరకుండి) మహేంద్రా! (గాలవు నిగాంచి) తాపసోత్తమా! ఈయాసనము నధిష్ఠింపుడు.

(అందఱును నాసీనులగుదురు.)

విష్ణు—అమరలోక విభుండవగునీవును తాపసోత్తముఁడగు నీగాలవుండును నేదియో యొక్క విశేష కార్యముండి యేతెంచిరనితలంచెదను నేను మీయెడలఁజేయవలసిన కార్యమెద్ది?

గార—ఇందిరారమణా! సర్వము నెఱింగియుండియు మాచే వినఁగోరి యడిగెదవు? జలంధరుని దుష్కృత్యములలో నీవెఱుంగనివే మున్నవి?

సీ. ఆలింపవదియేల • యాశ్రమంబులఁజొచ్చి
సంయమీంద్రులఁబెట్టు • శ్రమలనెల్ల
అరయకుంటివదేల • యజ్ఞవాటికలెల్ల
నేలమట్టము జేయు • నీచగుణము
జాలిబూనవదేల • సాహసంబున లోక
ములనేచుదుర్మార్గ • మునుఁదిలకించి
చెవిజేర్పవదియేల • శ్రీహరీ యనివేఁడు,
తాపస సతుల యా • ర్తారవంబు

తే. గీ. అన్నియును జూచుచుండియు • మిన్నకుంటి
వేల? జలంధరుఁ దున్మ • వేల? నీవు
గాన మాకు లోకముల ర • క్షకుఁడెవండు?
శ్రితజనావనశీలల! • క్ష్మీకళత్ర.

నారదుఁడు—(ప్రవేశించి విష్ణుమూర్తిఁజూచి) నిజమే నిజమే! జలంధరుని దుష్కృత్యము లపారముగనున్నవి.

తే. గీ తపసుఁగల్లియానవిమైనఁ • దలఁపకుండ
శంభురాణిని బట్టంగ • సాహసించె

యిట్టి కార్యంబు చేసిన • హీనునకును
వరమునీంద్రపత్నులే • పాటివారు
గొప్పయోడల లోఁగొనఁ • గొట్టు మీను
నకఁ దలపతెప్ప లరయ జం • నకలుగావె.

ఇంద్రు—నారాయణా! జలంధరుఁడు తాపసాశ్రమములందుం బ్రవేశించి చేయుచున్న దుష్కృత్యముల సహింప నలవికాను. ఈ మధ్య తనదుండగము నమరలోకము పైనఁగూడ బ్రారంభించినాఁడు. అమరకాంతలనుగూడ బంధింప మొదలిడినాఁడు. ఒక్కఁడయ్యును సంగరమునకు వెనుదీయఁడు, పరాజితుఁడుగాఁడు.

గాల—తాపసాశ్రమములఁ బ్రవేశించి మునిపత్నుల బల్మిం గొనిపోవుతఱిని మునులకలుకవొడమి బృంద సాధ్వీత్వమునకు భయమందిశపియింపఁ జాలకయున్నారు. ఇంతకుమున్న సాధ్వియగు బృంద యాతనికడ నున్నప్పుడు శక్తియున్నంతవఱకిట్టి యకార్యములు జరుగకుండఁ జేయుచుండెను. ఇప్పుడా సాధ్వి దురాత్ముఁడగు జలంధరునిచే సముద్రమునఁ ద్రోయఁబడి, నీచే రక్షింపఁబడి బృందావనమునుండి, నీయందఁ జిత్తముఁ జేర్చి క్రూరుఁడైనను దనపతి కెవ్వరివలనను హాని కలుగకుండుగాక యని నిరంతర తపోవ్రతయై యున్నది.

ఇంద్రు—భగవంతా! ఇంకనీవా జలంధరునివిషయమై ప్రయత్నించకపోయిన, సాధ్వీమణులమానరక్షణమునకు మార్గము లేకయుండును.

విష్ణు—మహేంద్రా! జలంధరుని దుష్కృత్యములన్నియు నేనారయుచున్నయుంటిని. బృంద సాధ్వి. ఆమె సాధ్వీత్వమున కొకింత భంగము గలుగఁజో జలంధరుఁ డేహానియుఁ బొందఁడు.

ఇంద్రు—దేవా! సకలామరముని జనార్థమై నీవీ కార్యభరమును బూనవలెను.

విష్ణు—(తనలో) ఇదియు నొకమేలే. (ప్రకాశముగా) లోకహితార్థమైయిక్కార్యంబునకుఁ గడంగెదనుగాక! (నారదునిజూచి) నారదా!

ఈవిషయమున నీవుగూడ నాకుఁ గొంత సహాయము సేయవలసి యున్నది.

నార—భగవదాజ్ఞ శిరమున దాల్తునుగదా.

విష్ణు—నీవరిగి జలంధరుని బరమేశ్వరునిపై యుద్ధమున కరుగఁ బ్రేరేపింపుము.

ఇంద్రు—ఇట్టికార్యములన్న నీమహాత్మునకు సంతోషమే కదా (ఇంచుక యూరకుండి) దేవా! ఇక మాకాజ్ఞ నిమ్ము.

విష్ణు—శుభమగుగాక!

(గాలవుఁడు—ఇంద్రుఁడు—నారదుఁడు—నిష్క్రమింతురు)

విష్ణు—(తనలో) నేను జలంధరుని దేహముతోడ బృందను జేరి వంచించవలయును. (ఆలోచించి) కానిమ్ము. తుదకీయుద్యోగ మెట్లు పరిణమించునో చూచెద.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.





# సతీతులసి.

## పంచమాంకము.



రంగము:—[బృందావనమున బృంద విచారముతోఁ బ్రవేశము]

బృం—(తనలో) ఆహా! విచారాక్రాంతచిత్తులకు నిద్రరాదుకదా! అయ్యో! నాస్థితి కేమని వగతును! నాకిట్టిగతి సంభవించునని కలనైనఁ దలంచియుంటినే. నా ప్రాణేశ్వరునకు సన్మార్గము నవలంబింపుమని చెప్పుటచేత నేనెంత విరోధినయితిని. లోకమాతయగు పార్వతిని బట్టుటకు సాహసించి, రుద్రునికోపానలజ్వాలల కాహుతియగుటకు సంసిద్ధుడైయున్న యాతనిని రక్షించినందులకుఁ బ్రత్యుపకారముగ నన్ను జలరాసిం బడద్రోచెను గదా! (జలంధరుని నుద్దేశించి) హా నాథా!

సీ. పరకాంతఁగూడుట ◆ పాపమందును దెప్పి,
తినిగాని మఱినేమి ◆ తెలుపలేదు
మునిపత్నులనుగాంచి ◆ మోహమందుట గూడ
దంటిని నింకేమి ◆ యనఁగలేదు
వరమునీంద్రులఁగాంచి ◆ పరిహాసమొనరింప,
వలదంటి నొండేమి ◆ పలుకలేదు
భవదీయ పదసేవ ◆ వాంఛించితి నటంచు,
వేడితి మఱిమొద్ది ◆ వేడలేదు
తే. గీ. కటకటా నీకునై యింత ◆ కష్టపడెను
సాధ్వినగు నాకునీగతి ◆ సాఁతమందు

దుఃఖమును గూర్చుటేగాక • తోయరాశి
ద్రోచినాఁడ వేమందు నీ • దుష్కృతికిని.

ఆనాఁడు జలరాశియందు నీవు నన్ను ద్రోసినప్పుడు భగవంతుండగు శ్రీమన్నారాయణుఁడు నన్ను రక్షించియుండనిచో నాకీవిచారమేయుండదు. ఆమహాత్ముఁడు నన్నేల రక్షించెనాయని చింతించుచుంటిని. హా హా! మొన్న నారదుఁడు నాకడ కరుదెంచి నీవొనర్చుచున్న దుష్కృత్యములఁ గూర్చి చెప్పిన విని నేనెంతయు విచారించితిని. నేనేమి సేయుదును? ఇంక దేవత లందరును నీపై నలిగి యేమి సేయుదురో కదా! నీవు నన్నుఁ జంపినను, రక్షించినను, నీవే నాకు గతియని తలంచి మొన్న నారదుండరుదెంచి నీవు సురలోకమున కరిగి యుంటివని చెప్పి నీకడకు రానున్న నన్ను వారించెను. ప్రాణేశ్వరా నీవు సన్మార్గవర్తనుఁడవై నివసించిన నాకీజన్మంబున నోపఁగుదురా? ఆభాగ్యము నేను నోచుకొని యుంటినా? (ఇంచుక యూరకుండి) నన్నుఁ జంపఁదలంచిన నీవు నన్నుఁ గరుణింతువా? నీచే నిరాకరింపఁ బడిన నేనన్నాళ్ళింక యెట్లు బ్రతుకుదును? కాని, జీవించి యున్నంతవఱకు, నా హృదయమున నీ సేవయు, నిష్కళంకతయు మఱువకుండ నున్నంతవఱకు నీ కేవిధమయిన హానియు నెవరివలనను గలుగకుండుఁగాక! (దిక్కులఁ జూచి) ఇంకనెప్పటికి దెల్లవారునో కదా! (ఆకాశమువంక జూచి)

మ. తనచేఁ బోషణసేయఁగాఁబడెడు ప • ద్మశ్రేణిబాధింతు, వీ
వని, భావించిదె వచ్చె నీపయికి నెం • దైనం జనంజెల్లు నీ
కని ప్రేమంబును బూని నార్ద్రజలజా • తారాతికిం దెల్పవ
చ్చినచందంబున వేగుచుక్క యుదయిం • చెం బూర్వభాగంబునన్.

మ. ధరణిన్ జూడఁ ద్రికాలబోధమున కా • ధారంబు మత్కంఠను
స్వరమే యౌనుగదా మదుచ్చరిత శ • బ్దం బల్పమేయంచు దు
ర్భరగర్వం బెఱిఁగించుభంగిఁ బ్రియమా • రన్ గుక్కుటశ్రేణిభా
స్వరలీలన్ వడిఁగూయసాగె నదె వి • శ్వగ్రామధామంబులన్.

(ఆకాశమువంకఁ జూచి) అదిగో! రేచిల్కచెలి యుదయమా

శేంద్రివల్మీకముమీఁద బ్రత్యూషపర్వ సమయంబున విడిచిపోయిన నిర్మోకమునట్లు తూర్పుదిక్కునఁ బాండిమద్యుతి జనించినది. ఇంక నేను సూర్యోదయము కాకపూర్వమే కాలకృత్యముల నిర్వర్తించుకొని స్నానముఁజేసి భగవదారాధనయందుఁ జిత్తమును బ్రవేశపెట్టెదనుగాక? (నిష్క్రమించును)

(విష్ణుమూర్తి జలంధరరూపముతోఁ బ్రవేశించును.)

విష్ణు—[తనలో] నారదుని ప్రేరేపణమున జలంధరుఁడు శివునితో యుద్ధమున కరిగినాడు. ఇప్పుడు వారిరువురకును పోరు ఘోరమైయుండును. [ఆలోచించి] ఇంకఁ నేనాలోచించనేల? ఈ వేషముతో బృందం జేరెదఁగాక! తన భర్త దుర్మార్గుఁడయినను నాతని పద చింతనము హృదయమునందుంచుచు నిరంతరము నాతని క్షేమమునే కోరు పరమసాధ్విని నెట్లు వంచింపఁగలనో తెలియరాదు.

(ఎదుటఁ జూచి) అదిగో! బృంద.

తే. గీ. జాగరారుణలోచనా ♦ బ్జములతోడ
దంతపదశోభితామలా ♦ ధరముతోడ
పిరుదులందెడు మైలైన ♦ కురులతోడ
నలరు బృందమోమును జూడ ♦ హర్షమొదవె.

ఈమె యిప్పుడే స్నానమాచరించి భగవదారాధన యందుఁ జిత్తము జేర్చుటకుఁ దలంచుచు సూర్యోదయమునకుఁ గాబోలు నెదురుచూచుచున్నది. [పరికించి] ఆమె యిట్లేవచ్చుచున్నది. నేను నెమ్మదిగా నెదుటఁబడి నాయుద్యోగమున వర్తించెద. ఆహా!

తే. గీ. అఖిలలోకనాథుండ ♦ నైననేనె
యొక్కయువిదపై సమ్మోహ ♦ మూనియిట్లు
దేవహితమనువంకపై ♦ దెలివిమాలి
వచ్చితినిసీతలోదరిన్ ♦ వంచనంబు

సేయు; జనము లీకార్యమిా ♦ క్షమించిపన్న
నైశోనకయుండ్రి యాదర్శ ♦ కంబుగాఁగ
కంచెయే చేనుమేసిన ♦ గలదెదిక్కు.

[ బృంద ప్రవేశించును. ]

బృంద—(ఆకాశమువంకఁ జూచుచు)

సీ. ఉరుమహోదయధరే ♦ శ్వరుఁడు ధరించెడి,
మహానీయకోటీర ♦ మణి యనంగ
బలభిత్తుభామిని ♦ పాన్పుపైఁగట్టిన,
వింతైన పవడంపు ♦ బంతియనఁగ
ప్రత్యూషతరుణి, శ్రీ ♦ రామకై గూర్చిన
దివ్య నీరాజన ♦ దీపమనఁగ
దొలిదిక్కు పూబోడి ♦ యళికభాగమునందు,
దీపించు కాశ్మీర ♦ తిలకమనఁగ
తే. గీ స్వతరుణారుణకాంతులు ♦ భాసిలంగ
సకలజగముల నానంద ♦ జలధిముంచ
నాత్మలోపల భావించి ♦ యా పయోజ
మిత్రుఁడదిగో పూర్వాద్రి ♦ మీఁదఁదోఁచె.

(ఇటునటుజూచి) ఆహా! ఏమి! ఈ పులుగులయొక్క విచిత్రగతులు!

సీ. లేమావిచిగురును ♦ లేఁత నోటనుబెట్టి
ముదమునఁ దాదిను ♦ భూరిపికము
జంటబాయఁగలేక ♦ సంతసమ్మున, చాల
మధువునరసెడి ష ♦ ట్పదమిథునము
మాటికిమాటికి దన ♦ జోటినిఁ బిల్చుచు,
మించువార్ష మునఁజ ♦ రించుశుకము
విడచిన నే పోని ♦ యడరునో యని మెడ
మెడఁగల్పి తిరిగెడి ♦ మిథునయుగము
తే. గీ ప్రకృతి నింక నుండిన జీవ ♦ రాసులెల్ల
కలిత దాంపత్యసౌఖ్యంబు ♦ గాంచుచుండ

నా పురాకృతకర్మము • నకు మనంబు
సందు నేమని వంతు ని • ల్చితి నేను

విష్ణు—(తనలో) ఇదియే మంచిసమయము. (తొందరగా బృందను సమీపించి)

మ. తరుణీ! నీయెడ నేనుజేయు నపరా • ధంబెల్ల మన్నించి, స
త్కరుణావర్షము నాపయిం గురిసి, నీ • కౌఁగింటిలోఁ జేర్చి నా
వెరపున్ మాన్పుము; బుద్ధివచ్చెను మహా • విజ్ఞానమబ్బెన్; నిరం
తరమున్ శీఘ్రమునందు దాల్చెద భవ • ద్వాక్యంబులన్ సుందరీ.

చ. గతజలసేతుబంధమున • కై తలపోయుట పాడిగాదు; దు
ర్మతినయి నేను నిన్ బలుతె • ఱంగుల బాధలుపెట్టినాఁడ, నీ
మతి సవియెల్లఁ బోవిడిచి • మానిని సత్కృప నాదరించి; యం
చితగతి నేలుకొమ్ము సర • సీరుహనేత్రి విశాలలోచనా.

బృంద—(తనలో సంతోషముతో) ఆహా! నేఁడెంతయు సుదినము. భగవదనుగ్రహమువలన, నా నాథునకు నా యెడలఁ గరుణ జనించినది. ఈతఁడు తా నొనర్చిన యకృత్యములకుఁ బశ్చాత్తాపమందుచున్నాఁడు. ఈతని పదసేవ నాకు లభించుటంజేసి నేను కృతార్థురాలను. (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! ఎన్నాళ్లకు నాయందు దయవచ్చినది. నిన్నుఁ గరుణించుటకు నే నెంతదానను?

శా. రాకాచంద్రుని రాకకున్ నిశచకో • రంబట్లు చండాంశునో
భాకారంబునకున్ సరోజమటులే • యత్యాశతో, నెప్డు నీ
రాకన్ గోరుచు నున్నదాన నిట; నన్ • రక్షింప భావించి యా
హా! కారుణ్యముబూని వచ్చితివి ధ • న్యంబయ్యె జన్మంబిలన్.

నాథా! ఇప్పటికైన నాయందు కరుణగలిగినది. నీవుఁ నాయందు నిష్కరుణవహించి నీ పదసేవకు నన్ను దూరముగఁ జేసినను, నేను నీ పాదసేవ మరచియుండలేదు నా యెడల నీవు గినుకవహించి జలరాశిందో్రియ శ్రీమన్నారాయణుని యనుగ్రహమున బ్రదికితిని.

లేకున్న నే నీపాటికి స్వర్గసౌఖ్యము ననుభవించుచునే యుందును. ఇంతకును నీ చరణంబుల గొలిచి కృతార్థురాల నగుటకు గాబోలు బ్రతికియుంటిని.

విష్ణు—(తనలో) ఈమె నన్ను జలంధరునిగనే భావించినది. ఇంతవఱకును నా ప్రయత్న మనుకూలముగనేయున్నది. (ప్రకాశముగా)

ఉ. నీవు మహాపతివ్రతవు • నిర్మలధర్మ వివేకశీల స
ద్భావము నీదుసొమ్ము; జన • వంద్యను నిన్నును నేని యట్లు దు
ర్భావముఁబూని హింసలకు • పాల్పొనరించితి; వానిసైచి; మో
దావహచిత్తమూని చని • తార్థునిఁజేయుము సుందరీమణీ.

బృంద—మనోహరా! నీ కరుణకు పాత్రురాలనేగాని విను తిక్కఁగాను గడచినదానికి నీవుగాని నేనుగాని చింతించినందువలన, బ్రయోజనము లేదు. ఇంక మన మా సంగతి మరచిపోవలయును

విష్ణు—

మ. జలజాక్షీ! భవదీయ వాక్యములనే • స్వాంతంబునం దెంచకే
పలుభంగుల్ నినుహింసఁబెట్టితి బరా • ప్తాత్ములం బట్టితిగ
నవితోగ్ర ప్రధనంబులన్ విబుధులన్ • గారించితిన్; దానసా
వళి బాధించితి వారిసన్నిధిఁగటా • బంధించి తత్పత్నులన్.

ఇది యంతయు నట్లుండ ముక్కంటిచే భస్మముగాకుండ నన్ను రక్షించిన మహాసాధ్వీశిరోమణివగు నిన్ను సముద్రమునఁ గూలవైచితిని. ఈ పాపములన్నియు నన్నేవిధమునఁ గట్టికుడుపునోకదా! (విచారమునటించును)

బృంద—మనోహరా! పాపమొనర్చి పశ్చాత్తాపమునొందువారా పాపము ననుభవించరని యార్యులు చెప్పుదురు.

విష్ణు—భయాకలితచిత్తుఁడనగు నన్ను నీ భుజపంజరమున జిక్కించుకొని వెఱపు మాన్పుము. (కౌగలించుకొనుచున్నాఁడు).

బృంద—జీవితేశ్వరా! గతించినసంగతులఁ దలంచుకొని యేల విచారించెదవు?

తే. గీ. నీపరిష్వంగసౌఖ్యంబు • నిక్కముగను
వర్ణనముసేయఁ గవికైన • వశముగాద
టంచు, బలుకంగ నగుఁగాదె • యట్టియెడల
పదములుంచునె నాకుక్షిఁ • బద్మనయన.

[జలంధరుని శిరము వారిముందుఁ బడును.]

బృంద—(తొందరగా విష్ణుమూర్తి చేయి విడిపించుకొని జలంధరుని శిరముజూచి) హా! ఇదియేమి? (మూర్ఛిల్లును.)

విష్ణు—(తనలో) ఈ వ్యాపారము తుద కేమగునోకదా,

బృంద—(విష్ణుమూర్తినిజూచి) హా! కపటనాటకసూత్రధారీ! ఎంతమోసముజేసితివి? (భర్తశిరమునుబట్టుకొని) హా! ప్రాణేశ్వరా! నీ వీ ప్రపంచమును విడిచిపోయితివా?

ఉ. అయ్యయొ జీవితేశ, యిటు • లైతివె! యిందుల కేమిసేతు, నా
కెయ్యది యింకదిక్కు; మఱి • యెవ్వరివేడుదు; రక్తసిక్తమై
యివ్విధ నీశిరంబకట • యీ దశబొందఁగ గాంచియుండియున్
వ్రయ్యలుగాకయుంటి లల • నల్ కఠినాత్మలుగారె యారయన్.

హా! మనోహరా! నా యెడల నీవు నిష్కారుణావహించి నన్నుశాసినను, నీ పదసేవయె జేయుచు, నా సుమంగలత కేవిధమగు భంగము రాదుకదాయని తలంచితిని. వంచకుఁడైన హరి భవనేయాకృతిఁదాల్చి వచ్చుట యెఱుంగక నీవేయని భావించి నీ పదదాస్యము లభించెఁదా యని యెంతయో సంతోషించితిని అక్కటా! నీకిట్టి దుర్దశ గలిగించిన దెవ్వరోకదా?

విష్ణు—రణమున ముక్కంటిని దాకుటచే నీగతి బొందెను.

బృంద—(భర్తనుద్దేశించి) జీవితేశ్వరా? ఇంక నే నెంత విచా
రించిన నేమిప్రయోజనము !

సీ. ఐశ్వర్యమిచ్చిన • హరుఁడాది దేవతల్
భవదీయ చరణాన • వఱలటంచు
నీ యకృత్యములకు • నిత్యంబు భయమందు
దాపసేంద్రులు పాలి • కావులంచు
సాధ్వీశిరోమణుల్ • సంయమీంద్రుల పడం
తులు వెలసతులతోఁ • దుల్యులంచు
భారతీనాథ కృ • పాలబ్ధ వికృమ
శౌర్యబలములు శా • శ్వతమటంచు
తే. గీ. గర్వమునఁబూని యట్లు లో • కములయందు
మిన్నుమన్ను నెఱుంగక • మేనుమఱచి
తిరిగినందుకు పాప మీ • కరణి నిన్ను
గట్టి కుడిపెను తప్పునే • కర్మఫలము.

సీ. నిరంతబు దేవతల్ • నిఖలమానవులకు
బూజార్హులను బుద్ధి • బూవలేక
యెచట ధర్మంబుండు • నచటనే జయముండు
ననెడి వాక్యంబును • నరయలేక
తాపసోత్తములను సం • తాపింపఁజేయుట
యే నాశనంబని • యెంచలేక
సాధ్వీమణీ తిర • స్కారమే వంశంబు
గడతేర్చుననుమాటఁ • గాంచలేక
తే. గీ. గర్వమునఁ జరించినందుకుఁ • గలుష మిట్లు
బండి కారణంబయ్యె భ • వన్మృతికిని
నిందు కేమనివగతును • నేఁడదిక్కు
నీవు జేసట్టి యీ బ్రదు • కేలనాకు.

సీ. పరసతీసంగమ ♦ వాంఛయొక్కటి చాలు,
సత్కులంబెల్ల ధ్వం ♦ సంబుసేయ
సంయమీశ్వరతిర ♦ స్కార మొక్కటిచాలు,
సకలభాగ్యముల నా ♦ శనముసేయ
తగసాధుజనుల సం ♦ తాపమొక్కటి
కలితపుణ్యము లడు ♦ గంటఁజేయ
దేవదూషణ దురు ♦ ద్దేశ మొక్కటిచాలు,
నిమిషంబులో ♦ పల నీరుసేయ
తే. గీ. నక్కటా యివియన్ని నీ ♦ యందు నమరి
యుండుటంజేసి యిట్టి చే ♦ టొందనయ్యె
వగచినంతన కేమి లా ♦ భంబుగలుగు
కర్మఫలమిట్లు నిన్నునుఁ ♦ గట్టికుడిపె.

ప్రాణేశ్వరా! నేఁక శోకమునూని ధైర్యచిత్తనై నిన్ననుసరించి కృతార్థురాల నయ్యెదగాక! (విష్ణుమూర్తిఁ జూచి) శ్రీహరీ! నీవు నన్నిట్లు వంచించెదవని కలనైనఁ దలఁచియుండలేదు. నా చిత్తవృత్తి నెఱింగి యుండియు నిట్టి యకార్యమున కేల యుద్యోగించితివి? ఇదియా నీధర్మరక్షణము!

చ. అనిశము దీనసంతతిని ♦ నారసి, వారల కోర్కెఁదీర్చుచున్
మనుచుటొ; దుష్టదైత్యుల ర ♦ ణంబున శౌర్యమునన్ వధించుచున్
ఘనమతి దేవతాతతినిఁ ♦ గాచుటొ; యక్కట యిట్లు సాధ్వినై
న ననుఁ గుయుక్తిమానహర ♦ ణంబొనరింపగ ♦ నెంచుటో హరీ.

దీనీవలన శ్రీహరి, పరాంగనాహరణమానసుఁడని వచ్చునింద కన్న, మఱియొక లాభ మేమి యందఁ దలంచితివి.

విష్ణు—నారీమణీ! నిఖిలజగజ్జేగీయమానంబగు భవదీయ సౌందర్యమునకుఁ జిక్కితి నను సంగతి నీ వెఱింగి యుంటివి. అది యట్లుండుము. ప్రస్తుత మీ కార్యము నిఖిలామరమునిజనార్థమై నాచేఁ జేయఁబడినది. తాపసపత్నుల బరిమిం బట్టుచు, దాపసులకు సంతాపముఁ గలుగఁజేయుచు, దేవతలకుఁ గూడ బాధకలిగించుచున్న నీ నాథుఁడిం-

తవఱకును నీ సాధ్వీత్వమువలన నేకీడును బొందకయున్నవాఁడు.

తే. గీ. చాన! నీ మది నొక్కింత ♦ చంచలతను
గలుగఁజేస్రినేని ము ♦ క్కంటివలన
నాలమున నీదు నాథుండు ♦ గూలుననుచు
నిట్టిమాయఁ బన్నితి దేవ ♦ హితముకొఱకు
గినుక నొందకు నాపైనఁ ♦ గీరవాణి

జగద్ధితార్థమై నేనొనర్చిన యీకార్యము నింద్యముగాక యుండుఁగాక! సాధ్వీమణి వగు నీయశమున కావంతయుఁ గళంకముండకుండుఁగాక! నాకు నీయందుఁ బ్రీతియుండుటంజేసి నీవఖిలలోకవిభులచేఁ బూజింపఁబడెదవుగాక?

బృంద—మాధవా! పరాంగనల వచించుటయేనా నీవు దేశహితము కొఱకు సేయుకార్యము ఇదియేనా! నీధర్మసంధత! ఇదియేనా! నీభర్తృరక్షణము! నాభర్తృమృతికే దుఃఖింతునా? నీకొనర్చినయకార్యమునకే వగతునా? ఎట్టిదుష్కార్యము జేయుటకు సాహసించితివి! సాధ్వియనియొక్కింతయైనఁదలంపనైతివికదా! దేశహితార్థమై పరాంగనలమానభంగమొనరింపదలంతువుగా! ఆహా! ఏమి! నీభువనపరిపాలనదక్షత! నీకీయాధిపత్యము లభించుటయు ధ్వాంతంబులందుండు ఖగమునకు పటీరాద్రివాసము లభించినట్లును, పాషాణముల మ్రింగు పారావతమునకు రత్నరాశి లభించిన చందమునను! గ్రామతటాకాంతరంబున వర్తించు కొంగకు మానసరోవర విహారమమరిన మాడ్కిని, ముఱుగుడుబొందులఁదినుజంబుకంబునకు మత్తసామజము తలమెదడు జేకూరిన కరణిని నున్నది. (కోపముతో) సాధ్వినగు నాయెడల నట్టి యకార్యమాచరించి, మదీయాగ్రహంబునకుఁ బాత్రుండవైతివి. జాజ్వల్యమానదావజ్వాల లశ్రమంబుగ హరింపవచ్చును. కఠినసంజ్వర ధుర్యకాకోలగుళికలు మ్రింగవచ్చును. నానాజగజ్జాల నాశనప్రక్రియోజ్జ్వల మృత్యువుతోనైనను బెనంగి గెలువవచ్చును. యమదోఃప్రకాండదీవ్యచ్చండదండంబునైనను నిలువవచ్చును. కాని సాధ్వీమణుల కా

గ్రహము గలిగించి తదీయ శాపవాక్యాగ్నిజ్వాలలందు బడకుండ నెవ్వరును దప్పించుకొనజాలరు.

విష్ణు—(తనలో) ఈమె నాకు శాపమిచ్చినా దేమి?

శా. విరిబోడీ! యిటు లాగ్రహింపనగునే ◆ బృందారకుల్ వేడ నీ
కరణిం జేసితి వారికిన్ హితముగా ◆ గన్ దీనిచే నీ మనో
హరుఁ ద్రెళ్లెన్ విను మెందు నొక్కరికిఁ గీ ◆ డైనన్ లభించున్ మహో
త్కర్షకిన్ మేలిది నీవెఱుంగవొకొ లో ◆ కంబందు నీ మార్గముల్.

బృంద—ముకుందా! అవ్యక్తవాక్యంబులచే నేలసమర్థింపఁజూచెదవు! నాకు బతి వియోగముంగూర్చి దుఃఖ మొదవించినందులకు నీవు దీనికిఁ దగినఫల మనుభవించక పోదువా? ధర్మము దప్పి చరించినపిదప నీవు భగవంతుఁడవైననేమి? మఱెవ్వరైననేమి? ధర్మసంరక్షణార్థమై మానవతులను భంగ మొనరింపఁదలచుటయా నీగుణము సాధ్వీమణుల కాగ్రహం బొదవెనేని వారించుట కెవ్వరుజాలుదురు? నిశ్చయమైనసాధ్వీకాగ్రహం బొదవెనేనియొక్క పుట్టువ సమస్త జగత్ప్రళయము సంభవించునట్లు జేయగలుగునని తలంపుము. నీవొనర్చిన కార్యము నా హృదయమును దహించుచున్నది. కాని మ్ము ఇందులకుఁ బ్రతిఫలముగా నీవు పాషాణంబవై యుండుము.

విష్ణు—హా! హతోస్మి- (రాయిగా మారును)

బృంద—(దేవతల నుద్దేశించి) ఓ, యింద్రాది దేవతలారా! రణమున మదీయనాథుని గెలువఁజాలక యిట్టికపటము పన్ని కలుషంబార్జింపఁదలంచి శ్రీహరిని నాకడకు బంపిన దుష్టచిత్తులగు మిమ్ము నీరుగ జేసినను నాకోపము చల్లారదు. మాధవుని నొక వేషధారిగఁ జేసి యీవంచన నాటకము బ్రదర్శింప సాహసించితిరి.

[ఇంద్రుడు బ్రహ్మతో ప్రవేశించును.]

ఇంద్రు—[బృందనుగాంచి] సాధ్వీమణీ! మన్నింపుము. దేవతల యెడల నట్టిసాహసమును సేయవలదు.

బ్రహ్మ—[రహస్యముగా] మహేంద్రా! రోషావేశంబున నీ సాధ్వి జగత్కర్త యగుకుందుని భాషాణముగా జేసినది. మనము నెమ్మదిగా నీమెను బ్రసన్నురాలుగఁ జేసికొనవలయును లేకున్న భర్తృసంతాప పీడితయగు నీమె యేమిచేసినను జేయగలదు.

ఇంద్రు—[బృందనుజూచి]

సీ. వసియింపుమంచును ♦ వక్షంబు నిచ్చిన,
పతిపీడి యంకంబు ♦ బరగులక్ష్మి
యర్ధశరీరంబు ♦ హరుడీయఁ; జూడక,
చండియై చరియించు ♦ శైలతనయ
మొగమునం దుంచినన్ ♦ మగనిని పీడి దో,
పద్మసన్నిధానంబు ♦ చాన వాణి
నెత్తినెక్కించుకో ♦ నిన నాథు విడనాడ
పంకమున బొరలు ♦ నవిత గంగ
తే. గీ. నీకు సాటిరారంచును ♦ నిక్కముగను
జాతి జెప్పెద వేయేల ♦ సాధ్వి నీదు
దివ్యమహిమంబు గనులకుఁ ♦ దెల్లమయ్యె
హరినిసిలగాగ గావించి ♦ యలరినావు.

బృంద—(ఇంద్రుని జూచి) ఏమి! నీ సక్రవినయము! అందిన జుట్టును, నందకున్న గాళ్ళను బట్టుట యను నామెత నీయందు నిజమగుచున్నది. భగవంతుండగు లక్ష్మీకళత్రుని సన్నువంచించు దురుద్యోగమున నత్తించనీవే ప్రేరేపించి, మదీయ శాపమునకుఁ బాత్రుండగు నట్లు జేసితివి. తాఁ జెడిన కోతి వనంబెల్ల జెడిచె నన్నట్లు మొదటినుండియుఁ బరాంగనల వంచించు మాయోపాయ దురంధరుఁడవగు నీ విట్టి యుపదేశములనే యొరులకుఁ గూడ జేయుచుందువు.

ఉ. మారుని బారికోడి యభి ♦ మానము గోల్పడి గ్రిమ్ముకుక్కటా
కారముఁ బూని కూతనిడి ♦ గౌతమపత్నికిఁ జానుసీలకున్

జారుఁడవై దురంతమగు ♦ శాపమునొంద సహస్రయోని సం
భారము మేనిపైఁ గనిన ♦ పాపరతుండవు నీవుగావొకో.

మ. కకుబంతాధిప దివ్యరత్నమకుటా ♦ గ్రస్థాపిత భూతభీ
తికరోద్దీపిత శాసనుండవు మహా ♦ ఘోరుండవై యుండి జం
కకపాపంబున కింతయే నిగమలా ♦ కాంతున్ సమున్ జేరి పం
చకమున్ జేయుమటంచుఁ బంపితివి; దు♦ష్టాత్ముండ వీవారయన్.

ఇందుడు—(తనలో) నే నేమియుఁ జెప్పకపూర్వమే యీమె నన్ను నిందించుచున్నది. ఇంతటితో నూరకొనునో లేక, నన్నుగూడ శాపతప్తునిఁ జేయునో.

బ్రహ్మ—[బృందఁజూచి] సాధ్వీమణీ! ఆగ్రహింపక నాపలుకు లాలింపుము. నీకు బలియుని, ధర్మమెంతయును లేదు. పుండరీకాక్షుం డిట్టి కార్యమును దాపసజన సంతాప నివారణార్థమై చేసె నను సంగతి నీ వెఱుంగుదువు. నిరంతరమును మాధవుని చిత్తమును సేవించు నీవే యద్దేవాదిదేవుని నిట్లు శపింపనగునా? ఆతఁడు లేకున్న జగములగతి యేమగును?

బృంద—దేవా! భారతీరమణా! అధర్మోద్యోగమున బ్రవేశించి నాభర్తమృతికి గారణమై నాకు వైధవ్య మొదవించి నప్పుడు నా కీజగములతో నేమిపని యున్నది? ఎవరు త్రవ్వుకొన్న గోతిలో వారే పడుదురు. సాధ్వినగు నన్ను వంచింపదలంచి మధుసూదనుం డిట్లు శాపమునందె దీనికెవ్వరేమి సేయుదురు?

[లక్ష్మీదేవి -- ప్రవేశము.]

లక్ష్మి—(తనలో) బృందకడకు వచ్చునాధుని, నిట్టికార్యము సేయవలదని యెంతచెప్పినను వినక వచ్చి తుదకు సాధ్వీమణి యగు నామె శాపంబునకు బాలయ్యెను. అక్కటా! ఇప్పుడు నే నేమి సేయుదును? (పరికించి) బ్రహ్మేంద్రులు గూడ భయమంది, యీమె

తో సంభాషింపజాలక యున్నవిధము తోచుచున్నది. ఇక నేనే యామెను వేడుకొందుగాక. (బృందను సమీపించును.)

బృంద—దేవీ! పద్మాలయా! భగవంతుని యెడల నేను మహాపరాధ మొనర్చితిని. నన్ను మన్నింపవలయును.

లక్ష్మి—బృందా! నీవు సాధ్వివి, సాధ్వీలోకతిరస్కారమువలన నాథుఁ డట్లయ్యెను. జరిగినదానింగూర్చి తలంపక, నాయందు గరుణాంతరంగవై పతిభిక్షఁ బెట్టుము. శ్రీహరి లేనివైకుంఠమున నే నెట్లుందును? అదియట్లుండ సకలజగంబులును సంతాపసాగరంబున మునుంగును.

బృంద—అమ్మా!

చ. వనజభవాదిదేవగణ వందితుఁ డే పతి యట్టి యీపతిఁ దత్పదా
ర్చనమునకంటె నెందు నితరంబగు శ్రేయ మభీప్సితోపసా
ధన మది లేదు నిక్కమిది తల్లి! సమస్త మెఱింగియుండియుఁ
వనజదళాక్ష నీగతి నొసర్చితి జేర్చితి నేను దుఃఖముఁ.

జననీ! నామూలమున నీకుఁగాని జగములకుఁగాని సంతాపమొదవనేల! నాభర్త శిరముతో నగ్నిం బ్రవేశించెదగాక! అంతట నీప్రాణేశ్వరుఁడు నిజరూపము ధరించును. (బ్రహ్మేంద్రులనుజూచి) పితామహామహేంద్రులారా! నేననలప్రవేశ మొనర్చుటకు దగిన యత్నము గావింపుడు.

(బ్రహ్మేంద్రులు - నిష్క్రమింతురు.)

బృంద—(లక్ష్మీదేవిం జూచి) జననీ! నాకనుజ్ఞనొసంగుము. సాధ్వీమణులకు భర్తయే దైవము. కావున నేను పతిమార్గము ననుసరించుచుంటిని.

లక్ష్మి—సాధ్వీ! సాధ్వులమని గర్వించు నారీమణులను దలయెత్తకుండ చేసి, నన్నును, వనజాతను, భారతినిగూడ మించిన నీపవిత్రచరి

త్రము, మహామహిమయు నసమానము. అమ్మా! సాధ్వీ! నీపతిభక్తికి మించిన పుణ్యముకంటె బ్రపంచమున మఱియొకండు లేదు. సాధ్వీపరిభావమునకు సాటియైనది లేదు. తల్లీ! నీచరిత్రము నారీమణుల కెల్లరకు నాదర్శకమగుగాక!

బృంద—(పాషాణమైయున్న విష్ణుమూర్తింగాంచి కరములుమోడ్చి)

సీ॥ అఖిలజగన్ని యా ♦ మయకుండవయినట్టి
మాధవా! నీదివ్య ♦ మహిమ లెన్న
భారతీపతికైన ♦ నశముగా, దట్టిచో,
నజ్ఞానురాల నే ♦ ననగ నెంత
పాత్రుల వేష్టతో ♦ బాత్రులుగఁ జేసి,
జగ మను రంగ దే ♦ శంబునందు
నాటలాడించుచు ♦ నరుల మహానుభా
వుఁడవైన నిన్ను సం ♦ పూర్ణకోప
మున నట్లు శిలగాఁ గ ♦ మ్మని పల్కినంతనె;
బృంద సాధ్వియనెడి ♦ పేరు జగతి
నిలుపంగఁగాబోరు ♦ శిలరూపు నీవిధ
గరిమవైకొంటివి ♦ గాక యున్న
లోకేశ్వరుండవైన ♦ నీకు నేశాపంబు,
నొసఁగు టేమి! యది ♦ నీవొంద టేమి!

తే. గీ ఏననలముఁ … చ్చెద ♦ నీవు తొంటి
దివ్యరూపంబు ధరియించి ♦ తేజరిలుచు
నఖిలజగముల నేలుచు ♦ నలరుమింక
సాధుజనరక్ష! శ్రీవక్ష ♦ జలరుహాక్ష!

(నిష్క్రమించును.)

లక్ష్మి—ఆహా! ఈమె చరిత్రము సర్వజగద్వినుతిఁబాత్రమైనది, (ఎదుటఁజూచి) అదిగో! బృందనాథునిశిరం బగ్నిం బడవైచి తానుగూడ నందు బ్రవేశించినది.

(శిల-విష్ణురూపముగా మాఱును.)

విష్ణు—బృందా! బృందా!

లక్ష్మి—ప్రాణేశ్వరా! ఏమిది!

విష్ణు—బృంద యెక్కడ? బృంద యెక్కడ?

లక్ష్మి—అదిగో శ్మశానమున గతించిన నాధునితో సగ్నిం బ్రవేశించినది.

విష్ణు—(ఎదుటఁజూచి) హా! బృందా! బృందా!

(నిష్క్రమించును)

లక్ష్మి—అక్కటా! బృందపై నీ మహానుభావున కీ పరితాపమేమి? నేనరిగి, నెమ్మదిగా నాధుని వైకుంఠమునకు దోడ్కొనిపోయెదఁగాక.

(నిష్క్రమించును)

ఇది పంచమాంకము.



# సతీతులసి

## షష్ఠాంకము.

---

[కైలాసమున సతీదేవియు, ఇంద్రుడు, బ్రహ్మయు ప్రవేశము.]

సతి—(బ్రహ్మేంద్రులను జూచి) బ్రహ్మేంద్రులారా!

శా. ప్రాతఃకాలనిశాంతధూసరశశి ♦ ప్రాయంబులై మీ ముఖా
బ్జాతంబుల్ కళ జాఱియున్నగతిఁ గ ♦ న్పట్టెన్ ననుం జూడ నీ
భీతిన్ రాఁబని యేమి? యంతటి మహా ♦ వైక్లబ్యసంప్రాప్తి యే
రీతిం గల్గెను మీకు దెల్పుడు ధృతి ♦ శ్రీచిత్తముల్ బూనుచున్.

ఇంద్ర—జగజ్జననివగు నీకుఁ దెలియని విషయమున్నదా? పరమేశ్వరునిచే ఖండింపఁబడిన జలంధరుని శిరముతో సాధ్వియగు బృంద యగ్నిం బ్రవేశించినంతనే నామె శాపమునఁ బాషాణమైన శ్రీహరి నిజరూపమును బొంది బృందకై పరితపించుచు శ్మశానమున విహరించుచున్నాఁడు.

బ్రహ్మ—దేవీ! శతకోటి దినకర ప్రతికోటి దురవలోకత్తేజస్సమార్జితంబును, చంద్రసూర్య తారాసంకటకర ప్రాసాదసౌధహర్మ్య వ్రజంబును, సకలదిగ్రచిత గేహవ్యూహ నిర్వ్యూహమణిఘృణి ఘూళితాంబరతలంబును, శోకమోహక్షుత్పిపాసాజరామృత్యువర్జిత ప్రాణిగణంబును. నగు వైకుంఠము శ్రీహరి లేకపోవుటంజేసి కడుఁజెన్నుఁ దఱిగియున్నది. ఇందిరాదేవి సంతాపచిత్తయైయున్నది. కావున గరుణఁబూని పద్మాలయామనోహరుఁడు వైకుంఠమును ప్రవేశించు మార్గమునరసి, లోకసంతాపమును బాపుము.

సతి— తే. గీ. అఖిలదేవాదిదేవుఁడై • యలరునాథ
డొక్క యువిదకై తాపంబు • నొందు టేమి
యమ్మహాత్ముని మహిమంబు • లరయ
నేరికైనను శక్యమే • యెంచిచూడ

బ్రిహ్మేంద్రులారా! నేనొకవిధమగు బీజము నొసంగెదను ఇట్లే మీరు లక్ష్మి సరస్వతులయొద్ద గూడ గ్రహించి, భగవంతుఁడగు శ్రీహరియున్న బృంద శ్మశానవాటికయందు నాటుఁడు. నావలన గ్రహింపఁబడి మీచే నాటఁబడు బీజము బృంద ప్రతిరూపమై తులసి యను పేరబఱగి విష్ణుని మోహ పరితాపమును బోగొట్టును.

ఇంద్రు— మహాప్రసాదము.

పార్వ— ఇదిగో! (బీజమునిచ్చును)

ఇంద్రు— అంబా! ఇట్లే లక్ష్మి సరస్వతుల వలనగూడఁ గ్రహించెదము.

బ్రహ్మ— దాక్షాయణీ! ఇఁక మేము పోయివచ్చెదము.

(తెరవాలును)

రంగము (2) (శ్మశానభూమి:—ప్రవేశము-విష్ణుమూర్తి:—

విష్ణు—(ఇటునటుఁజూచుచు,) ఆహా! శుష్కపలాగతాగతశీత కంకరోష్ట్రి గృధ్రఘుఘూకితధ్వానంబును, నుత్కటీకృతశిరోజాతప్రతాపంబును, దుర్గంధనిదానంబును నగు నీశ్మశానంబెంత భయంకరముగనున్నది? ఇందు విహరించుట కా పార్వతీనాథునికే తగియున్నది (బృందనుద్దేశించి) హా! బృందా! నీపై మోహము నన్నెంతకు దెచ్చినది! శతసహస్రహస్తకరోజ్జ్వలమై విద్యుల్లతికావగాతవివిధోద్యద్వైజయంతీయుతమై, వేధఃసుధరధ్వజప్రముఖ దేవాగ్రేసరోపాసితంబై యొప్పు వైకుంఠమునునుండు నేను నీపైఁ బరితాపమున నిట్లు భూతప్రేతపిశాచ ఢాకినీగణంబులకు విహారభూమి యగు నీ ప్రేతభూమియందుఁ జరించుచుంటినిగదా!

తే. గీ. పూవుబోఁడి! శరత్కాల • పూర్ణశశికి
వంకలంబెట్టు నీముఖ • పద్మ మటుల
నకట యగ్నిలో వ్రేల్చుట • కాత్మ యెట్లు
నమ్మతించెనో తోఁచదు • సారసాక్షి.

చ. లలితమృణాలపల్లవ వి • లాసము మించెడు బాహువల్లి యు
జ్జ్వల దనలంబులో నిడఁగ • స్వాంతము సమ్మతిబూనె నెట్లు హా!
జలజముఖీమణీ! భువన • జాలము లన్నియు వేడ్కఁ గుక్షిలో
పల నిడుకొన్న నాకె బలు • వంతె ఘటింపఁగఁ జాలితెంతయున్.

తే. గీ. నేల నొక్కింత నడచిన • నలతి! యరుణ
కాంతివహియించు భవదీయ • చరణకమల
యుగ్మమగ్నిలోఁ గాలుచు • నుండఁ జూచి
యోర్చియుంటిని దుఃఖంబుఁ • జేర్చి మదిని.

సాధ్వివైన నీయశశ్చంద్రికలు చతుర్దశ భువనములయందును గాయఁజేసికొంటివి. నాచిత్తమునమాత్రము సంతాపము నాటితివి

(బ్రహ్మయు-నిందుడు-ప్రవేశింతురు)

ఇంద్రు—(బ్రహ్మనుజూచి) దేవా! భారతీరమణా! శ్రీహరి స్థితి యే రీతిని నున్నదో చూచితివా?

బ్రహ్మ— ఈ మహాత్ముని దర్శించి సంభాషింతముగాక (విష్ణుమూర్తిని సమీపించి)

సీ. అలవైకుంఠనగరి • నలరుచుండెడు నీవు
ప్రేతభూమిని విహ • రింపు టేమి
సన్మునుల్ భజియింప • సంతసించెడు నీవు
భూత భజనచేతఁ • బొలుచు టేమి
ఫణిరాజశయ్యపైఁ • బవ్వళించెడు నీవు
వల్లకాటిని నిల్చు • బడుచు టేమి

భక్తుల దుఃఖంబు • బాపుచుండెడి నీవు
భూరి దుఃఖాబ్ధిలో • మునుఁగు టేమి
తే॥ గీ॥ జలజవాసిని రాణివై • యలరుచుండ
బృందకై పరితాపంబు • బొందు టేమి
రమ్ము వేగ వైకుంఠపు • రమ్ము జేర
కమలదళనేత్ర! నన్నును • గన్నతండ్రి.

ఇంద్రు—

సీ॥ జలజాలయా దేవి • సతి, పద్మజుఁడుపట్టి
భారతికోడ, లీ • శ్వరుఁడు హితుడు
ఫణిభోజనుఁడు తేజి • ఫణిరాజు తల్పంబు
వందిజనములు తా • పసగణంబు
కౌమోదకీనంద • కనుదర్శనంబులా,
యుధములు ఘనశంఖ • మొత్తుబూర
యమర సంతతిసేవ • కావళి; యుత్కులు
సోమభాస్కరులు; కౌ • స్తుభము భూష
తే॥ గీ॥ ణం; బజాండంబు మేను; సం • ద్రంబు గృహము
భక్తచిత్తంబులు విహార • వనము; లిట్లు
జెలఁగుచుండిన నీవొక్క • కలికి కొఱకు
దాపమందుట మిగుల వో • ద్యంబు గాదె.

దేవా! నీకై రమాదేవి మిఁగుల బెంగఁగొని నీవు లేకుండుటచే వైకుంఠంబుఁ బ్రవేశింపక యున్నది సత్వరముగా విచ్చేసి మాకందఱ కును ముదంబుఁ గొల్పుము.

బ్రహ్మ—తండ్రీ! బృందకై యింకఁ బరితాపము విడువుము. నీ పరి తాపమును బాపుటకు మేము సతీదేవివలన నొక బీజమును గ్రహించి యీప్రదేశమున నాటితిమి. అయ్యది బృందప్రతి రూపము తులసియనఁ బఱగెఁ దానిం జూడుము.

విష్ణు—బృందప్రతిరూపమా? ఏది! ఏది!

(తెరలేచును)

[తులసిభూజముండును]

బ్రహ్మ—దేవా! వీక్షింపుము.

విష్ణు—(సంతోషముతో) ఆహా! ఏమి! (బృంద నుద్దేశించి) హా బృందా!

తే॥ గీ॥ పడఁతి! నాదు సంతాపంబు ♦ బాప నిట్టి
మాడ్కి నతి కృపన్ దులసిగా ♦ మాఱినావు
భళిర! నాకును బ్రియమైన ♦ వస్తు వగుట
నీవు మునిజనామరులచే ♦ నిఖిలజగము
లందు పూజలఁ గాంతువు ♦ నంద మెసఁగ.

సీ॥ దినకరోదయమును ♦ గనినంతనే కదా,
రాజిలు పద్మాక ♦ రంబువగిది
సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రరాకను గాంచి,
రంజిల్లు రత్నాక ♦ రంబు మాడ్కి
వాసంతలక్ష్మిని ♦ లాసోదయంబున
వికసించు నుద్యాన ♦ వీధిభాతి
వార్ధరురాకకు ♦ పరమ సంతోషంబు;
నొందుచు నుండు మ ♦ యూరమట్లు

తే॥ గీ॥ నీ మహోదయంబున నాకు ♦ నిక్కముగను
బరమహర్షంబు గలిగెఁదా ♦ పంబు వాసె
నఖిలజగంబులఁ బూజల ♦ నందుచుండి
తులసి యనుపేర నొప్పుచు ♦ జెలఁగుమింక.

బ్రహ్మేంద్రులారా! ఈతులసిమహోదయమున నేను స్వస్థచిత్తుఁడనైతిని. ఇంక నేను వైకుంఠమును ప్రవేశించెదను, కా

మీరుమాత్ర మొకకార్యము సేయవలయును. ఈతులసిని బృందా వనమునఁ బ్రతిష్ఠింపుడు.

ఇంద్రు—ఆజ్ఞ నెరవేర్చెదము.

బ్రహ్మ—మహేంద్రా! భగవంతుఁడగు శ్రీహరి స్వస్థచిత్తుఁడయినా డు. ఇంక మనకు గావలసిన దేమున్నది ?

ఇంద్రు—

సీ. జలజాక్షియౌ బృంద ♦ సాధ్వీత్వ పతివల,
కాదర్శకం బౌచు ♦ వలరు గాక
హరికిఁ బ్రీతియగుచు ♦ నలరుతులసి సమ
స్త గృహంబులందునఁ ♦ దనరు గాక
శ్రీనాథు ప్రీతికై ♦ చిరభక్తితులసిని,
జేరి యుండఁటును బూ ♦ జింత్రుగాక
తులసి వర్చించి, ని ♦ స్తుల సౌఖ్యభోగసం,
పదలు మానవులు గాం ♦ చెదరుగాక
తే. గీ. తులసి యుండు ప్రదేశమం ♦ దు హరికూడ
యుండి; భక్తజనులఁ బ్రోచు ♦ చుండుగాక
పరమ పావనంబుగ నెంచఁ ♦ బడెడు తులసి
దళము ప్రతివారు శిరములఁ ♦ దాల్త్రుగాక !

బ్రహ్మ—తథాస్తు. (తెరవాలును.)

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.

---

# ఆంధ్ర నాటకములు.

| | రు | అ. | ప | | రు. | అ. | ప. |
|---|---|---|---|---|---|---|---|
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 1 | 0 | 0 | ప్రహ్లాద | 1 | 0 | 0 |
| ప్రసన్నయాదవము డిటో | 0 | 8 | 0 | సంగీతసావిత్రి | 1 | 0 | 0 |
| పారిజాతాపహరణము | 0 | 8 | 0 | సత్యవిజయము | 1 | 0 | 0 |
| చతురచంద్రహాస | 0 | 8 | 0 | స్త్రీసాహసము | 0 | 11 | 0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1 | 8 | 0 | కృష్ణరాయభారము | 0 | 14 | 0 |
| కలభాషిణి డిటో | 1 | 0 | 0 | కృష్ణరాయవిజయము | 0 | 12 | 0 |
| రాజభక్తి డిటో | 0 | 8 | 0 | మదనసుందరపరిణయము | 1 | 8 | 0 |
| మోహినీమనోహరం ,, | 0 | 8 | 0 | శ్రీనివాసకల్యాణము | 0 | 8 | 0 |
| వేణీసంహారము వ॥ సు॥ | 1 | 2 | 0 | సురాజుస్త్రీలా | 0 | 8 | 0 |
| ఊర్వశీశాపవిమోచనము | 1 | 2 | 0 | వేశ్యాహితబోధిని | 1 | 0 | 0 |
| గర్వభంగ | 0 | 12 | 0 | మహానంద కో॥ స॥ | 0 | 12 | 0 |
| ప్రతిజ్ఞాయాదవము | 0 | 12 | 0 | కనకతార దా॥ సీ॥ | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణవిలాసము | 0 | 12 | 0 | కృష్ణతులాభారము | 0 | 12 | 0 |
| గులేబకావళి | 1 | 0 | 0 | మాలతీమధుకరము | 0 | 12 | 0 |
| పసన్ బకావళి | 1 | 0 | 0 | ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 0 | 0 |
| ప్రతిజ్ఞాపాండవము | 0 | 12 | 0 | సంపూర్ణభారతం | 1 | 0 | 0 |
| పాండవవిజయము | 1 | 0 | 0 | సుమతీదేవి | 1 | 0 | 0 |
| పాండవాశ్వమేధము | 0 | 12 | 0 | సుపక్షపాత్రి | 1 | 0 | 0 |
| పాండవాజ్ఞాతవాసము | 0 | 8 | 0 | చంద్రకాంత కో॥ స॥ | 0 | 12 | 0 |
| జయంత జయపాల | 0 | 12 | 0 | చింతామణి కా॥ నా॥ | 1 | 2 | 0 |
| కనకతార | 0 | 14 | 0 | చింతామణి చ॥ మూ॥ | 1 | 0 | 0 |
| మహానంద(క్రొత్తనాటకము) | 1 | 0 | 0 | చింతామణి రా॥ క॥ | 1 | 0 | 0 |

రంగా వెంకటరత్నం,
బుక్ సెల్లర్సు,
బెజవాడ.

